


# త్యాగరాజస్వామి భక్తికవితా వైభవం



ఆకెళ్ళ
అచ్యుతరామమ్

# త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం

శ్రీ త్యాగరాజ స్వామి వారి కృతి ప్రశంసా
వైభోగానికి మానస నీరాజనం

రచన :
ఆకెళ్ల అచ్యుతరామమ్

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

THYAGARAJA SWAMI BHAKTI KAVITHA VAIBHAVAM
Poetic Selections from Thyagaraja Swami's
Kirtanas with a Commentary
BY AKELLA ACHYUTA RAMAM


**యువభారతి**

ప్రచురణ : 82
ప్రథమ ముద్రణ : 6 జూన్ 1982
ప్రతులు : 2,200
ముఖపత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ, హైదరాబాదు.
ముఖచిత్ర ముద్రణ :
శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు.

ప్రతులకు :
**యువభారతి**
5, కింగ్స్ వే, సికింద్రాబాద్–500003
లేదా
**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు–500 001
వెల : రూ. 3/-

# యువభారతి పరిచయం



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదునెనిమిదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలయినంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 81 ప్రచురణలను ప్రచురించి మూడులక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 7100 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 725 మంది, భారతీభూషణులుగా 70 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవేమా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు,
6 జూన్ 1982

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు ; యువభారతి.

# మా మాట

# త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం

పాత కొత్తల విఁగడింపును పట్టించుకోకుండా సాహిత్యంలో చదువదగిన అంశాలను సరళమైన భాషలో అందించాలని యువభారతి ఉద్యమిస్తున్నది. ఇంత వరకు ఉత్తమ సాహిత్యాధ్యయనానికి అనువైన అవకాశాలు అనేకంగా ఏర్పాటు చేసింది. ఈ "కవితావైభవ" పుస్తకాలు దాదాపు 30 దాకా వచ్చినాయి. "త్యాగరాజ స్వామి భక్తి కవితావైభవం" ఇప్పుడు మీకు అందిస్తున్నాము.

భారతదేశంలో కవిత్వం అంటే కాళిదాసు గుర్తుకు వచ్చినట్టు దక్షిణ భారతంలో సంగీతమంటే త్యాగయ్య గుర్తుకు వస్తాడు దాక్షిణాత్య సంగీత సంప్రదాయంలో త్యాగయ్య ముఖ్యుడు. ఆయన తపస్సు మూడు పాయలుగా ప్రవహించింది. సంగీతము, భక్తి, సాహిత్యం. సంగీతంలో ఇప్పటికీ ఆయన మార్గదర్శకుడే. ఆయన భక్తుడు. నిరాడంబరుడు. రాజాశ్రయాన్ని నిరసించిన నిరీహుడు. నాదబ్రహ్మోపాసన ఆయన జీవిత లక్ష్యం. ఆయన కీర్తనలు భక్తి పారవశ్యానికి శబ్దరూపాలు. భారతీయ ఆత్మకు ప్రతీకలు. తన సంగీతంతో, తన నిర్మల జీవితంతో, తన ఉత్తమ కవిత్వంతో ప్రజాబాహుళ్యాన్ని పునీతం చేసిన ఆ ఋషికల్పుని కీర్తనలు ఎన్నో ఉన్నవి. వాటిలో కొన్నింటిని ఏరి సులభమైన వివరణంతో ఈ పుస్తకంలో అందిస్తున్నారు శ్రీ ఆకెళ్ల అచ్యుతరామమ్ గారు.

శ్రీ అచ్యుతరామమ్ గారు ఆంధ్ర, సంస్కృత, ఆంగ్లభాషలలో చక్కని అభినివేశము సంపాదించినవారు. ఉద్యోగరీత్యా గణకులుగా ఉన్నా సాహిత్యాభిమానాన్ని గుండెలో పదిలపరచుకొన్న సహృదయులు. భారతీయ సంప్రదాయాభిజ్ఞులు. కనుకనే ఆయన రామాయణ రచనకు పూనుకొన్నారు. త్వరలోనే ఒక చక్కటి తెలుగు రామాయణాన్ని శ్రీ అచ్యుతరామమ్‌గారు తెలుగు ప్రజలకు సమర్పిస్తారు. మా యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూత నిస్తున్న సాహిత్యాభిమానులు శ్రీ అచ్యుతరామమ్‌గారు. "త్యాగరాజ స్వామిభక్తి కవితా వైభవం" వ్రాసి ప్రచురించుకొనే అవకాశాన్ని యువభారతికి కల్పించి శ్రీ అచ్యుతరామమ్‌గారు తమ సహృదయతను చాటుకొన్నారు. ఆయనకు యువభారతి సాదరంగా కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకొంటున్నది.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువ భారతి.

హైదరాబాద్,
6 జూన్ 82.

# కృతజ్ఞత

శ్రీరామచంద్ర చరణార్చక భక్తశ్రేష్ఠ !
బహురమ్య భావరస సంయుత గీతకర్త !
వేదాంత తత్త్వ బహుశాస్త్ర వివేకమూర్తి !
శ్రీ త్యాగరాజ గురుదేవ, నమో, నమస్తే !

మన తెలుగు దేశంలో, భక్తి బంధురభావ సామ్రాజ్యాలని పరిపాలించిన ప్రసిద్ధులలో ముగ్గురు రాజులున్నారు - త్యాగరాజు, పోతరాజు, గోపరాజు ! త్యాగరాజు "కృతులూ", పోతరాజు "భాగవతమూ", గోపరాజు (రామదాసు) "కీర్తనలూ" తెలుగు వారికి రసోద్దీపకములై, అమృతోపమానములై, భావ చైతన్యానందాన్ని ప్రసాదించాయి. తెలుగు వారు త్యాగరాజు కృతులను ఎంత వరకుపయోగించుకున్నారని పరిశీలిస్తే— ఆడపిల్లలకు పెండ్లికోసం తప్పని సరిగా నేర్పించిన "పెళ్ళి సంగీతంలో" కొన్ని కృతులు పెండ్లి వరకూ ఆ అమ్మాయిల హృదయాలకు వంటబట్టేవి. ఇక సంగీత కచ్చేరీలలో— వర్ణం, గణపతి ప్రార్థనాకృతి అయాక, రాగం తానం పల్లవి బోలెడు కాలం ఆక్రమించుకునే ముందో వెనకో, శ్లోకం, జావళి, పల్లె పదాలూ, తిల్లానా, మంగళం, యివన్నీ పాడే ముందు, ఏ రెండో మూడో త్యాగరాజ కృతులకి చోటుండేది. అప్పుడు కూడా ఆలాపనా స్వరసంగతుల మధ్యలో త్యాగరాజ స్వామి వారి పాటల్లోని మాటలు ఇముడ్చబడేవి. కొన్ని కృతులలో చరణాలన్నీ పాడరు; ఒక్క త్యాగరాజ మకుటం ఉన్నది మాత్రం పాడుతారు. ఎన్నో కచేరీలలో, త్యాగరాజస్వామి వారి కీర్తనలు స్పష్టంగా, పూర్తిగా పాడరేమి అన్న కించ నా మనస్సులో మిగిలిపోయేది.

సంగీతం అంటే చాలా యిష్టం అవటంచేత, గ్రామఫోనులు కొత్తగా వచ్చిన రోజుల్నించీ అన్ని రకపు పాటలూ వింటూ వుండేవాడిని, హిందీ, మరాఠీ, తెలుగూ, అరవం కన్నడం అనే విభేదం లేకుండాను. కాలేజీలో (ఆంధ్రా యూనివర్సిటీ హాస్టల్స్‌లో) హిందీ సినీమాల ప్రాబల్యం యెక్కువై "సైగల్-పంకజ్" పాటలు తెలుగు విద్యార్థులు స్వంతం చేసుకున్నారు కొందరు తెలుగు

పాటలు పాడినా, బంగాళీ ట్యూన్లల్లో పాడుతూ, "ఇదే బంగాళీ కుర్రవాడైతేనా ......" అన్న గురజాడ కన్యాశుల్కం వాక్యాన్ని సార్థకం చేసుకునేవారు. ఆ వాతావరణంలో తిరిగి పెరిగిన నాకు, కేవలం ట్యూన్ కోసం, తాళగతి కోసం మాత్రమే పాటలు వినడమంటే మనస్కరించేది కాదు. భాష యెఱిగి, భావం తెలిసిన రస సిద్ధికి ప్రక్క వాద్యాలుగానే రాగమూ తాళమూ ఉండాలని ప్రత్యేకించి కర్ణాటక సంగీతానికి అటువంటి రససిద్ధే పరమ ప్రయోజనం అనే సిద్ధాంతం నా యెదలో నాటుకు పోయింది.

నా చిన్న తనంలో మా అమ్మగారూ, యింకా మిగిలిన స్త్రీ బంధువులూ, కృతులూ, అధ్యాత్మ రామాయణ కీర్తనలూ, పెండ్లి పాటలూ, మంగళహారతులూ అవీ పాడేటప్పుడు స్పష్టంగా పాటలోని పదాలు ఉచ్చరించి, సంగీతాన్ని సాహిత్యోపహారంగానే అందించేవారు. కొన్ని వందల కృతులు నేర్చుకున్న మా ఆవిడ కూడా మాటల స్పష్టతని సంగీతానికి బలి యివ్వలేదు. అంచేత త్యాగరాజ కృతులలోని సంగీత సౌందర్యాన్ని సంపూర్తిగా అనుభవించి ఆనందించడానికి అందులోని సాహిత్యపుటాహార్యం అతి ముఖ్యమనే సిద్ధాంతం నా మనస్సులో బలపడింది

నే చదువుకునే రోజుల్లోనే మా మేనమామ గారు (కీ. శే. వేలమూరి సూర్యనారాయణ మూర్తి - వృత్తిలో ఇంజనీరు) నన్నాశీర్వదించి "శ్రీ త్యాగరాజ స్వామి కీర్తనలు" అనే పుస్తకాన్ని (600 కీర్తనలూ ప్రహ్లాద భక్త విజయం, నౌకా చరిత్ర కూడా ఉన్న ది... సాహిత్యం ఒక్కటే ఉన్నది). నాకిచ్చి "ఇది నీ కిష్టం కామా చదువుకో" అని అన్నారు. బాగా చిన్నప్పుడు మా అమ్మమ్మగారు పోతన భాగవతం అంతా నాచేత చదివించుకుని వింటూండేవారు. ఆ పునాదితో గట్టిపడ్డ నా మనస్సు త్యాగరాజ కీర్తనలలోని పదరచనా బంధుర రససిద్ధికి సమ్మోహితమై పోయింది;ఆ పాటలలోని భావనాపటిమా, సముచితత్వం, పెల్లుబికి వచ్చే భక్తి రసవాహినీ నన్ను ఉక్కిరి బిక్కిరి చేశాయి. నాకున్న కొద్దిపాటి సంగీతజ్ఞానంతోనూ, భక్తితోనూ ఆ పాటలు పాడుతూ, కాదు చదువుకుంటూంటే, నాకెంతో ఆనంద సంసిద్ధి కలిగేది.

62-63 లో నేను సదరన్ రైల్వేలో ఉద్యోగిగా మద్రాసులో ఉన్నప్పుడు కీ॥ శే॥ చిత్తూరు నాగయ్యగారి సన్నిహితత్వం నాకు సిద్ధించింది. నేనుదహరించిన భక్తి సామ్రాజ్యాధినేతలైన ముగ్గురు తెలుగు రాజులనూ వెండి తెరపై కెక్కించి, తానే వారు ముగ్గురూ అయిపోయిన నాగయ్యగారి కీర్తిప్రాభవం అందరకూ తెలిసినదే. వారు "త్యాగరాజు" సినీమా తీసేటప్పుడు, అందులోని పాటలు తానే పాడేటప్పుడు "రాగోత్కర్షము వల్ల, భావోత్కర్షము వరుగు పడనీయ

కూడదని ఎంతో శ్రమపడ్డాను" అని చెప్పారు. ఆ ఫలసిద్ధిని తప్పక సాధించిన విషయం నా తరంవారిలో ఆ సినిమా చూసిన వాళ్ళకి బాగా తెలుసు. నాగయ్య గారూ, నేనూ ఎన్నో త్యాగరాజకృతులను గురించి, సాహిత్యపరంగా, రాగభావ సమన్వయం గురించి ముచ్చటించుకునే వారం. వారి పరిచయం కూడా త్యాగరాజ స్వామి యెడల నాకున్న మమతాబంధసంయుత గురుభావనను పెంపొందించింది.

ఆ రోజుల్లోనే సంగీత కళానిధి టి.వి. సుబ్బారావుగారి (మరాఠీ మాతృభాష అయినవారి) "Studies in Indian Music" అనే ఉద్గ్రంథం లభించింది. త్యాగరాజుల వారి వాగ్గేయకారకపుటౌన్నత్యాన్ని ఉగ్గడిస్తూ, వారి భాషా సౌలభ్యాన్ని వివరిస్తూ, స్వామివారు తన కృతులలో రాగభావ సమన్వయ సంసిద్ధిని ఆకాశపుటంచులకెత్తిన వైచిత్ర్యాలని వారు వివరించినవి చదువుకున్నాక, త్యాగరాజస్వామి వారి కృతులలోని పదాలమీద అనురాగం యింకా యెక్కువై, వారి కవితా ప్రాభవ పరిశీలనకు బహుళదోహదకారి అయింది. వీలైనప్పుడల్లా నా మనస్సులోనే యీ విషయ విశేష వివరాలు మననం చేసుకుంటూ రెండు దశాబ్దాలు గడిపేశాను. "చెప్పేవాడికి వినేవాడు లోకువ" అన్న సామెత కనుగుణంగా, వినడానికి యిష్టపడ్డ వాళ్ళందరికీ (నా పరిచయులకి, సభల్లో కూడానూ) శ్రీ త్యాగరాజ స్వామి వారి భక్తి కవితా వైభవం గురించి ఊం చెప్పేస్తూ ఉండేవాడిని!

ఇప్పుడు "యువభారతి" వారు నా యీ ఉబలాట ప్రదర్శనకి యింకొక అవకాశం కల్పించి, యీలా పుస్తకంగా పలుకమన్నారు. ఇందులో నేను సూచనా ప్రాయంగానే స్వామివారి భక్తి కవితా వైభవాన్ని గురించి ముచ్చటించాను. సంగీత వైదుష్యం, భావనాపటిమా-ప్రకటనా, భావరాగ సమన్వయం, భక్తి కవితా ప్రాభవం, తాత్త్వికార్థ శేముషి అనే శీర్షికలతో ఒక్కొక్క కృతి మీదనే ఇంతలేసి పుస్తకాలు వ్రాయదగ్గ కృతులెన్నో ఉన్నాయి, స్వామివారి రచనల్లో. స్వామివారి కృతుల సంపుటి ఒక విరాట్ కృతి సముదాయ సముజ్జ్వల మూర్తి! ఆ మూర్తికి యీ ఒక్క కర్పూరపు బిళ్ళ వెలిగించి "సాహిత్య నీరాజనం" పట్టే మహాభాగ్యం నాకు కల్పించిన "యువభారతి" వారికి నేను ఋణపడి వున్నాను. ఆ సంస్థ వారికి నా కృతజ్ఞత. ఇందులో నే నుదాహరించిన వారందరికీ— నాకూ త్యాగరాజస్వామి వారికీ మధ్యగల అనుబంధాన్ని పెంపొందించినందులకు కృతజ్ఞత. అన్నిటికన్నా మిన్న, ఈ జన్మలో నా కిటువంటి మనస్సును ప్రసాదించిన శ్రీ రామచంద్రునికి నా కృతజ్ఞత!

—ఆకెళ్ల అచ్యుతరామమ్.

# కృతి – సుకృతి

పద్యకవితలోని అందాలు చెప్పటం వేరు. పదకవితలోని చందాలు చూపించటం వేరు. రెండూ రెండు విద్యలు. ఒకటి సాహిత్య సంప్రదాయానికి చెందింది. మరొకటి సంగీత సంప్రదాయానికి చెందింది. పదకవితలో సాహిత్యం సంగీతంతో ఆమ్రేడితమై అలరారుతుంది. పదకవితలో కూడా ఎన్నో ప్రక్రియ లున్నాయి. కృతి, పదం, కీర్తన మొదలైనవి వాటిలో విశిష్ట ప్రక్రియా గౌరవా న్నందుకొన్నాయి. వాటిలో కృతి ప్రధానంగా సంగీత సంప్రదాయానికి చెందింది. సంగీత సంప్రదాయాన్ని సమగ్రంగా పోషిస్తూనే, దానికి సాహిత్య గౌరవాన్ని కూడా కల్పించిన మహనీయుడు త్యాగయ్య. అందువల్ల త్యాగరాజస్వామి వారి కృతుల్లో సంగీత విద్వాంసులు గానరస మాధుర్యాన్ని ఆస్వాదించి, ఆస్వాదింప చేస్తారు. సాహిత్య మర్మజ్ఞులు భావసౌరభాలను ఆస్వాదించి సాహిత్యరస వివేచనం చేస్తారు. అయినా, కృతిలో సంగీత సాహిత్యాలు క్షీరనీర న్యాయంగా కలిసి ఉండటం చేత ఉభయ సంప్రదాయాలు తెలిసిన ఉచితజ్ఞులు కాని దాని తత్త్వాన్ని ఉజ్జ్వలంగా వ్యాఖ్యానించలేరు. పూజ్యులు శ్రీ ఆకెళ్ల అచ్యుతరామంగారు ఉభయ సంప్రదాయకోవిదులు కావటంతో త్యాగరాజ స్వామివారి భక్తికవితా వైభవాన్ని దర్శించి, మనచేత దర్శింపజేయ గలిగారు.

త్యాగరాజ స్వామి వ్యక్తిత్వంలో మూడు గుణాలు ప్రధానంగా ఉన్నాయి. 1. నాదబ్రహ్మోపాసన శక్తి. 2. భక్తిజ్ఞాన పరిపాకం. 3. కవితాలాలిత్యం. సంగీత విద్వాంసులు త్యాగరాజు ప్రస్తరించిన రాగవైభవాన్ని జీవన గానంగా ఆలపిస్తారు. సమగ్ర రాగ ప్రస్తారమే త్యాగరాజ స్వామి ధ్యేయమనీ, దానికి ఆలంబనంగా కృతులలోని సాహిత్యాన్ని గ్రహించాడని సంభావిస్తారు. కృతిలోని భావం కంటె స్వర ప్రస్తారమే ముఖ్యమనీ, దానివలన కలిగేది గానరసమనీ భావించి కృతులను ఆలపిస్తారు. వారికి సంగీతం మీద ఉన్నరక్తి అధికం. సాహిత్యంమీద ఉండే భక్తి గౌణం. అయితే, సాహిత్యోపాసకులు త్యాగరాజ కృతుల లోని సాహిత్య రసికత్వాన్ని, సంగీత సంయోజన సౌలభ్యాన్ని సమీక్షించి భక్తి రస సిద్ధిని సాధించుకుంటారు. ఒకరు గానరసోపాసకులు; మరొకరు సాహిత్య

రసోపాసకులు. గానరసం స్వరలయ సమ్మేళన కళావిన్యాసం వలన ప్రతీయ మానమయ్యే ఆనందానుభవం. సాహిత్యరసం శబ్దార్థశక్తులద్వారా ప్రతీయ మాన మయ్యే భావాల చర్వణం వలన సహృదయు డనుభవించే అలౌకికానందం, రసా నంద స్థితి రెండిట్లోను ఉంది. అయితే, గానరసంలో అవ్యక్తంగా భాసించే ఆపాత మాధుర్యంలా రసస్థితి ఉంటుంది. సాహిత్య రసంలో వ్యక్తమైన అర్థస్థితి యొక్క ఆలోచనంద్వారా కలిగే అమృతత్వలబ్ధిగా రసస్థితి నిలుస్తుంది. రసస్థితి ద్రవస్థితి. నాదం కానీ స్వరంగానీ సహజంగా ఆర్ద్ర బిందువులు. సంగీతంలో స్వరాల వలన కలిగే అనుభవం సముద్రంమీద వాన కురిసినట్లుంటుంది. జలబిందువులు జలంలో వివక్షా విరహితంగా ఏకమై పోతున్నట్లుంటుంది. అందువలననే సంగీతాన్ని ఆపాత మధురమని వివేచించారు ప్రాచీనులు. సాహిత్యంలో శబ్దాలు వడగళ్ళ లాంటివి. వడగళ్ళ వానకురిస్తే, అవి కరిగి నీరై జల రూపంగా మారి నీటిలో ఏకం కావటానికి కొంతకాలం పడుతుంది. శబ్దంలోని అర్థం-లేక భావం-ఆర్ద్రమైన జలబిందువు కృతిలోని శబ్ద మాధుర్యం అర్థవిచారణం వలనగాని రసస్థితి నందింప లేదు. కాని, కృతిలోని స్వరం సరాసరి రసస్థితిని కలిగిస్తుంది. గాన రసంలో శబ్దార్థ విచారణం లేదు. శిశువులా, పశువులా, ఫణిలా నాదాన్ని అర్థవ్యక్తితో అవసరం లేకుండానే ఆస్వాదించడం అందులో ప్రధానం. ఆర్ద్రమైన నాదంతో ఆత్మను ఆర్ద్రం చేసికోవటమే గానరస ఫలం. పాడితే త్యాగరాజ స్వామి కృతు లక్షయ గాన రసాన్ని అందిస్తాయి.

కృతికి స్వచ్ఛమైన సంగీతానికి లాగానే గాన రసమే ధ్యేయమని సంగీత మర్మజ్ఞుల మతం. అయితే, త్యాగరాజ స్వాములవారు సంగీతాన్ని, గీతాన్ని సంపదించి, మన కందించి ఆ కృతిని సుకృతిని చేశారు. త్యాగరాజులవారి కృతుల్లోని సాహిత్యం నీటిలో కరుగుతున్న చక్కెర పలుకుల్లాంటిది. దాని వలన కృతికి రుచి లభించింది. రుచి అంటే ఆస్వాదనీయత్వం అనీ, కాంతి అనీ రెండర్థాలున్నాయి. ఈ రెండర్థాలూ త్యాగరాజ కృతుల్లో అన్వర్థా లయ్యాయి. స్వరం భావాన్ని వ్యక్తీకరించలేదు. అందువలన శబ్దాన్నాశ్ర యిస్తుంది. దానివలన దానికి ఆస్వాదనీయత్వం సిద్ధిస్తుంది. శబ్దం అర్థ వంతం కాబట్టి అర్థ దీప్తిని ప్రసాదిస్తుంది. కృతుల్లోని సాహిత్య గౌరవమే అర్థదీప్తి, ఆలోచనా మృతం. దానిని ఉపాసిస్తే లభించేది సాహిత్య రసా నందం.

ఒక్కమాటలో చెప్పాలంటే-కృతులలోని రాగాన్ని ఆలపిస్తే కలిగేది గాన రసం; కృతులలోని సాహిత్యాన్ని సమాలోచిస్తే కలిగేది సాహిత్యరసం. త్యాగ రాజులవారికృతుల్లోని భక్తిరసాన్ని అందించే కవితాసౌందర్యాన్ని సందర్శించటం ఈ గ్రంథ లక్ష్యం.

భక్తి శృంగారాదుల వంటిది కాదు. అది ఎంత ఆలోకిస్తామో అంత ఆధ్యాత్మికం. త్యాగరాజస్వామి భక్తిజ్ఞాన పరిపాకం పండిన క్షేత్రం కృతు ల్లోని సాహిత్యం. కవితా లాలిత్యం ఆపాతమధురం. శ్రీ ఆకెళ్ళ అచ్యుత రామంగారు త్యాగరాజస్వామి వారి లాగానే శ్రీరామ భక్తులు, కవులు, గేయ రచనా కోవిదులు. సజాతీయ ప్రవృత్తి గలిగిన సహృదయ శేఖరులు కృతు లను సుకృతులను చేసిన కవితా మహిమను సమీక్షించారు. సం-గీతంలో గీతా నందాన్ని చవి చూపించారు; పంచరత్న కీర్తనల్లోని పంచప్రాణాలను ప్రదర్శిం చారు: 'నగుమోము'లోని సొగసంతా ప్రకటించారు; 'నారదగానలోలుడు' మన 'ప్రక్కన నిలబడి', 'ముమ్మూర్తులా' దర్శన మిస్తున్నట్లు చిత్రించారు; వేల్పు లెవ్వరూ రమారమణునితో సరికారనే భక్తి భావాన్ని నిరూపించారు; రామ చంద్రునిపై పూలు చల్లినట్లు, త్యాగరాజస్వామి కృతులపై సరళ వ్యాఖ్యా సుమాలను జల్లుజల్లుగా కురిపించారు. మంగళ గీతంతో మానస నీరాజనాన్నందిం చారు.

కృతికి భక్తిని నేర్పి త్యాగరాజస్వామి దానిని సుకృతిని చేశాడు. ఆ సుకృతిలోని భావ ప్రకృతిని వివరించి శ్రీ ఆకెళ్ళ అచ్యుతరామంగారు సుకృతు లయ్యారు. యువభారతి ఈ కృతిని ప్రచురించి సుకృతి అయింది.

హైదరాబాదు
15-5-1982.

జి. వి. సుబ్రహ్మణ్యం,
యువభారతి ప్రధాన సంపాదకులు.

# * సం - గీతం; గీతానందం

శ్రీ త్యాగరాజస్వామివారి ప్రసాదించిన కృతి సముదాయం ఒక పాల సముద్రం వంటిది. ఆ క్షీరసాగరాన్ని తఱచినకొద్దీ అందులో నుండి సర్వవిధము లైన సౌభాగ్యములూ ఉద్భవించి లభ్యమౌతాయి. ఆ తఱచే విధానాలు కూడా అనేకాలు. కేవల సంగీతామృతాన్ని మనసార గ్రోలవచ్చు. భక్తి పారవశ్యంలో భగవద్సామీప్యసిద్ధి పొందవచ్చు. ఆ భక్త్యావేశ సంచలితమైన మనస్సులో భావ లాస్య తాండవానందాలను అనుభవించవచ్చు. ఆ కృతులలోని సాహిత్య సాంగత్యంలో జిజ్ఞాసామధువునీ ఆలోచనామృతాన్నీ అదే పనిగా ఆస్వాదించవచ్చు. అయితే యీ అన్ని ప్రసాధనలకూ ఉండవలసిన సామాన్య లక్షణం అనురాగంతోనూ ఆత్మశుద్ధితోనూ ఆ క్షీరాబ్ధి మధనం ఆరంభించి అంతము వరకూ ఏకాగ్రతతో ఆచరించడం. ఆ ప్రసాధనల కన్నిటికీ ప్రసాదోపలబ్ధి, ఫలపరమావధి బ్రహ్మానందమే ! అయితే ఆ బ్రహ్మానందం, త్యాగరాజ స్వామి వారన్నట్లు, స్వానుభవైక వేద్యమే !

శ్రీ త్యాగరాజస్వామి వారు పరమోదారులైన గురువులు— కనుకనే వారు తమ కృతులలో పరమార్థాలను ఎన్నిటినో యిముడ్చి మనకు ప్రసాదించారు. కృతుల సాహిత్యపుటర్థ వివరణ చేసుకోవడమే ఒక పరమార్థం. "గీతార్థము..." అని మొదలయ్యే సురటిరాగ కీర్తనలో త్యాగరాజ స్వామి వారన్నారు,— "గీతార్థము, సంగీతానందము(ను) ఈ తావున జూడరా, ఓ మనసా !" అని. గీత యొక్క అర్థమునూ, సంగీతములోని ఆనందమును ఈ స్థలంలో చూడమని తన మనస్సుని ప్రబోధించుకున్నారు. అనుపల్లవిలో సీతాపతి చరణాబ్జము (తన మనస్సులో) నిడుకొన్న వాతాత్మజునికి (ఆంజనేయ స్వామికి) (ఆలా చూడడం, ఆ గీతార్థం, ఆ గీతానందం ఆ సంగీతానందం) బాగ తెలుసును అని వివరించారు. గీతార్థము మనస్సుతో (బుద్ధితో మాత్రమే కాక) గ్రహించి, సంగీతానందాన్ని అనుభవించాలని ఉద్బోధ. గీత అనగానే భగవద్గీత అనే సామాన్య సూచన— సం-గీతములో తను ప్రసాదించిన సంగీతములో సుసంగతమైన గీతము ఉన్నదని అన్న సూచన. ఆ గీతార్థమూ, యీ గీతార్థము రెంటినీ యీ

తాపున (యీ కృతులలో) చూడరా అని ప్రబోధం. ఆయన కృతులను పాడుకునే మనకందరికీ యీ ప్రబోధం చేశారనిపిస్తుంది! ఆంజనేయస్వామి అర్జునుని రథకేతనం పైన తాను వసించి, శ్రీకృష్ణ పరమాత్ముడు ప్రసాదించిన భగవద్గీతామృతం గ్రోలిన మహనీయుడు. గీతార్థము అనురాగంతో తెలుసుకొన్న బ్రహ్మజ్ఞాని. అంతేకాక ఆయన సంగీత బ్రహ్మ-నారదుల వారి ఏమరుపాటు వల్ల సర్వదేవతలు శోషించి, సొమ్మసిల్లి నిస్రాణులై పోయినప్పుడు, ఆంజనేయస్వామి శంకరాభరణ రాగాన్ని సృష్టించి, సుస్వర సుశోభితామృత వర్షిణిగా ఆలపించి, ఆలా శోషించిన దేవతలను పునరుజ్జీవితులుగా చేశారన్న గాధ ప్రసిద్ధం. ఆ సంగీత భగవంతుడు, శంకరావతారుడు గనుక ఆ విధంగా మృత్యుంజయుడై విరాజిల్లాడు. అట్టి ఆంజనేయస్వామికి తెలుసునన్నారు—భక్తిజ్ఞాన వైరాగ్యములను సంగీతముతో మేళవించి, పరబ్రహ్మను హృదయమంతటితో సేవించే సాధనను, ఒక మహత్తర యోగంగా అనుభవించి, భక్తులకూ, సంగీత పిపాసువులకూ మార్గదర్శకాగ్రేసరుడు ఆహనుమంతుడు. అట్టి వాతాత్మజునికి బాగుగా తెలిసిన విధం: తెలిసి రామచింతన చెయ్యడం; గీతార్థ మెఱిగి సంగీతములోని ఆనందమును పొందడం; గీతముల అర్థమే త్యాగరాజు సంగీతానందమని గ్రహించడం. శ్రీత్యాగరాజ కృతులలోని ఆనందం మిగిలిపోకుండా అనుభవించడానికి మార్గం కృతుల (గీతముల) అర్థం ఆకళింపుకోడం. అదే యీ పుస్తక ప్రయత్నం.

తమ కృతులలో పదములను చతురిమతో, నైపుణ్యంతో, ప్రయోగఫలసిద్ధితో ప్రయోగించడం; అట్టి పదప్రయోగం ద్వారా భావాలను సౌలభ్య సుందరంగా చిత్రీకరించడం; ఆ భావాలకు అనుగుణ్యమైనవీ, యెంతగానో ఒప్పిపున్నవీ అయిన రాగాలలో సొగసైన కృతులను రచించడం; ఆ భావరసోద్దీపక కృతి సంగీతంలో వెలువరింపబడ్డ వాక్కువల్ల శ్రోతల, గాయకుల మనోవీధుల్లో చిత్ర్యశిల్పాల్ని సృష్టించి, నెలకొల్పి, ఆనందసంసిద్ధి కలిగించడం-ఇదీ త్యాగరాజ స్వామివారి ప్రతిభ-వారి భక్తి కవితా వైభవం: తెలుగువారికి ప్రత్యక్ష సిద్ధమైన సంస్కృతి వారసత్వం. "విన, విన, రుచిరా" అనిపించే స్వామివారి కృతులను పాడినప్పుడూ, పాడుకొన్నప్పుడూ, వినినప్పుడూ, గీతార్థమే సంగీతానందమన్న సత్యాన్ని గుర్తించుకొంటే ఆ బ్రహ్మానంద సాధనలో ఆ వాగ్గేయ సాహిత్యం పఠించుకోడం కూడా ఒక పరమలక్ష్యం అవుతుంది. ఆ లక్ష్యసాధనా ప్రయత్నంలో కొంత భాగమే యీ పుస్తకం.

I త్యాగరాజస్వామివారి పద ప్రయోగంలో సూటిగా హృదయానికి హత్తుకు పోయే నుడికారాలూ, బుద్ధికి గిలిగింతలు పెట్టి సొంపైన పంకరల త్రోవలో గమ్యానికి చేర్చే సమాసాలూ, భాషాభంగిమలూ ఎన్నో ఉన్నాయి. కొన్ని ఉదాహరణలు:-

**అపూర్వమైన సమాసాలు :**

i) వాసవరిపుజనకాంతకుడు : ఇంద్రుని శత్రువు (ఇంద్రజితుని) తండ్రిని అంతమొందించినవాడు, శ్రీరాముడు.

ii) పాదవిజితమౌనిశాప : ముని శాపమును పాదముతో ఓడించినవాడు శ్రీరాముడు. (ఎంతో తపఃఫలాన్ని వ్యయంచేసి యిచ్చిన మునీశ్వరుని శాపశక్తిని దేహేంద్రియాలలో తక్కువ (క్రింది) స్థాయిలో ఉన్న పాదంతో జయించిన ఉత్కృష్ట శక్తి స్వరూపుడన్న ధ్వని !)

iii) నిద్దురజితుడు : నిద్రను జయించినవాడు; పదునాలుగేళ్ళు నిద్రపోని లక్ష్మణుడు.

iv) సురసారిపు కరాబ్జ లాలితచరణుడు: సురసకు శత్రువైన హనుమంతుని పద్మాలవంటి చేతులు, పట్టి లాలించే పాదాలున్నవాడు, శ్రీరాముడు. మహాసత్త్వ సంపన్నుడు ఆంజనేయుడు. అయినా ఆయన భక్తితో రామపాద సన్నిధినున్నప్పుడు అతులమైన సత్త్వగుణ ప్రధానుడు కనుక ఆయన చేతులు శత్రువులను పడగొట్టే వజ్రకర్కశత్వంతో లేక భక్తి ప్రపూరిత పద్మమృదుత్వంతో విరాజిల్లుతాయి. ఆయన అనురాగం శ్రీరాముని పాదాలని గట్టిగా నొక్కనియ్యదు. తాకితేనే కందిపోతా యేమో అనిపించే పాదాలు రామునివి! కనుక అతిమృదువులైన తన చేతులకన్నా మృదువైన పాదాల్ని స్పృశించి; సున్నితంగా నిమురుతాడు, ''లాలిస్తాడు'' మనస్సులోని లాలసను స్పర్శలో చొప్పిస్తాడు. ఇదంతా స్ఫురింపచేసే ''లాలిత'' పద సౌభాగ్యం వెల్లివిరిపించారు త్యాగరాజ స్వామి!

iv) అహివిషసము విషయాలు: విషయ (ఇంద్రియ) సుఖములు పాము విషముతో సమానములని చెప్పడానికి, "విష" "విషయ"ల్లో ఉండే శబ్ద సామ్యం అమోఘంగా వాడుకున్నారు.

v) బహిరాననులు: అంతర్ముఖులు కాని వారు బహిర్ముఖులు. ముఖశబ్దంలో పరుషమైన "ఖ" కారాన్ని వాడనిచ్ఛగించక, పర్యాయ శబ్దమైన ఆననం, వాడి రెండు నయశబ్దాలు (నశబ్దాలు) ప్రక్కప్రక్కన ఉండే శ్రవణ సుభగత్వం సాధించారు.

vi) ఉదరశయనులు : "పునరపి జననీ జఠరేశయనం" అనే జగద్గురువుల భజగోవిందవాక్యం పురస్కరించుకుని జఠరశయనులకు బదులు ఉదర శయనులన్నారు. మళ్ళీమళ్ళీ జన్మలెత్తుతూ మాతృగర్భాలలో (తల్లుల ఉదరాలలో) పడుకోవలసిన దుస్థితిని (గర్భనరకాన్ని) కల్పించుకునే వాళ్ళు ఉదరశయనులు. స్వయంకర్తృత్వం కూడా సూచించే పదం ఇది- ఎవరి కర్మకు వాళ్ళే కారకులు, అంచేత మనస్సులు దగ్గర పెట్టుకుని సంచరించాలన్న ధ్వనీ, ఉద్బోధ తనలో నింపుకున్న సమాసం ఇది.

vii) తనవారితనము : విచిత్రమైన పదం. మంచితనము, గొప్పతనము కోవలోనే తనవారితనము సృష్టించారు త్యాగరాజస్వామి. తనకు సహాయ్యము చేసిన నరులను తన సహ పంక్తిని కూర్చుండబెట్టుకొని, అయోధ్యలో పట్టాభిషేకానంతరం విందారగించారట శ్రీరామచంద్ర మూర్తి! పేరుపేరునా పిల్చి వాళ్ళకి (ముత్యాల)హారాలు బహూకరించారట. ఇనవంశ రాజులు వ్యక్తిగతాభిమానాలు లేని న్యాయబుద్ధిని ప్రదర్శిస్తే తనకు సహాయం చేసిన వారిని తనవారు అనే మమకారంతో యింతగా అభిమానించావు అని రాముణ్ణి చనవుతో ఎత్తిపొడిచి ఆకాశానికెత్తేశారు త్యాగరాజస్వామి ! అందుకు పల్లవిలో మొదటి పదంగా ప్రయోగించారీ "తనవారితనముకు" (తనవారితనము లేదా అనే బేగడరాగకృతిలో) అట్లాంటి తనవారితనము తన యెడల యెందుకు చూపించడం లేదని తన రాముణ్ణి నిల్వదీసి అడగడం ఆ కీర్తనా ప్రయోజనం.

viii) సుజ్ఞాన దరిద్ర పరంపరులు : అతిశక్తివంతమైన సమాసం! ''పరంపర'' గొప్ప ఉపయోగంలోకి తెచ్చుకున్నారు. ''అనురాగము లేని మనసున సుజ్ఞానము రాదు'' అన్న పల్లవిలో సుజ్ఞాన రూపం వివరించారు స్వామి వారు. ఉత్పత్తితో పాటు భావోత్పత్తి సమకూర్చుకుని అనురాగం కల మనస్సుతో, భక్తిలో, పరమాత్మ సహచర్యం సిద్ధించుకున్న వాళ్ల సౌభాగ్యం ఏమనవచ్చు! అట్టి భాగ్యం లేనివాళ్ళు దరిద్రులే. ''సుజ్ఞాన దరిద్రులు!'' అట్టి సుజ్ఞాన దరిద్రం పరంపరగా నిల్పుకునే దౌర్భాగ్యులు, జన్మజన్మకీ ఆ దరిద్రం అనుభవించే వారన్నమాట. ఆ దరిద్రం వదల్చుకోడం సాధ్యం అయ్యే మానవజన్మలో కూడా ఆ దరిద్రం వదల్చుకుని మోక్షసిద్ధి పొందలేని దరిద్రులు వాళ్ళు! పాండిత్య ప్రకర్షతో, లౌకిక జ్ఞానంతో, సామాన్యజ్ఞాన ధనోపేతులైనా అనురాగం భక్తీ యిచ్చే సుజ్ఞాన ధనం లేనట్టి దరిద్రులు వాళ్ళు. అట్టి ధనహీనతా దరిద్రాన్ని పారంపర్యంగా, స్వయం కర్తృత్వంతో జన్మజన్మలకీ అట్టే పెట్టేసుకునేవాళ్లు ''సుజ్ఞానదరిద్ర పరంపరులు''!

II సాహిత్యంలో మామూలుగా వినపడే మాటలకు, కొలది మార్పులతో, చక్కని నూతన స్వరూపాలు, కల్పించి ప్రసాదించారు, త్యాగరాజ స్వామి :

i) నిశిచరుడు (నిశాచరుడు), రాత్రించరుడు అనే పదాలు రాక్షసుడు అనే పదానికి పర్యాయాలు. నిశిని రేయి అంటాం కనుక, త్యాగరాజుల వారు ''రేచారి'' అని వాడారు. అందులో రెండు రకారాలున్నాయి. (రాక్షసుడిలో ఒకటే రకారం!); అందులోనూ, ''రే''కి ''రి''కి యతి మైత్రి ఉంది; సుందోపసుందుల్లా, ''చా''కి యిరుప్రక్కలా నిలబడి ఆ రెండు ''ర''కారాలూ రేచారిని మరింత రాక్షసుడిలా చేస్తాయి! అలాంటి రేచారిని ఉపయోగించారు, వాచామ గోచరమే అని మొదలయ్యే కైక వశిరాగ కీర్తనలో.

ii) ''కరుణాసాగరుడు'' అన్న మామూలు వాడుక సమాసమే ''కరుణారస వరుణాలయుడు'' అన్న అనుప్రాసాన్విత మధురశబ్ద సుశోభిత సమాసమైనది, ''కనకనరుచిరా'' అని మొదలయ్యే వరాళిరాగ పంచ

రత్న కృతిలో, జలాధిదేవత వరుణుడు. ఆ వరుణదేవుని ఆలయం (వాసస్థానం) సాగరం. ఈ సమాసంలోని శబ్దసాగర తరంగాలు, ''కరుణారస'' ఒకటీ, ''వరుణాలయ'' ఇంకొకటీ ఒకదాని వెనుక యింకొకటి, సముద్రజీవులై తూగుతూ, సొగసుగా ఊగుతూ, దొర్లుకొంటూ వచ్చి శ్రవణ పుటాలను తాకుతాయి -బీచి ఒడ్డున నిలబడ్డవారి పాదాలని, రెండు సమాన కెరటాలు ఒకదాని వెంట యింకొకటి దొర్లుకుంటూ వచ్చి, పాదాలను తాకి, వెనక్కిపోతూ గిలిగింతలు పెట్టినట్లు !

iii) 'పీతాంబరధరుడు అనే అందరెరిగిన సమాసానికి ప్రతిరూపాలే అవుతాయి ''కనకచేలధరుడు'' ''కనకవసనధరుడు''. బంగరు చేలము కట్టుకున్న రాముడంటే త్యాగరాజులవారికి ఎంతో ముచ్చట! ఒట్టి బంగరు చేలము అంటే చాలక ''కరకు బంగరు చేలము గట్టుక మెల్లరారా'' అంటారు. ఒక ఉత్సవ సంప్రదాయ కీర్తనలో (కరకు బంగారం అన్న పదం తెలుగుతనం నింపుకున్న పుడికారం) అయితే సొగసైన పాటల మధురగతిలో, ''ధర'' శబ్దం మోటుగా బరువుగా పడుతుందని, దాన్ని వర్జించి, "కనకచేల". ''కనకవసన'' అనే సమాసాల్ని బహువ్రీహులుగా ధైర్యంతో వాడారు. (పీతాంబర ధరుడులోధరుడు వదిలేసి- "పీతాంబర్" అన్న బహువ్రీహిని హిందీలో ఉత్తరాదిని వాడినట్లు), ఈ ''కనకచేల'' నాటరాగ పంచరత్న కృతి ''జగదానందకారక'', లోనూ, ''కనక వసన'' వరాళి రాగ పంచరత్నకృతి ''కనకనరుచిరా''లోనూ శబ్ద నాట్యం చేస్తాయి!

III. భావావేశంతో, పరబ్రహ్మ స్వరూపమైన రాముని గుణకీర్తన చెయ్యడంలో తన్మయులై, వాక్కును రాగ సంపూరితం చేసి, గీతానికి సంగీతం జోడించి, ఆ వాక్కుతో ఉచ్చరించే పదాలకి సంగీతోపలబ్ధమైన అపూర్వ సౌరభాలను సమకూర్చి సంతరించడంలో శ్రీ త్యాగరాజులవారు వాగ్గేయ కారకత్వ సాధనలో సంగీత కుండలిని సహస్రారం ఎక్కించారు ! కొన్ని కొన్ని అక్షర సముచ్చయాలూ, పదజాలమూ ఒక్కొక్క రాగ ఛాయల్లో పాడుకుంటే, భావరాగ సమన్వయం పరాకాష్టనంది, బ్రహ్మానందానికి కారణభూతములౌతాయి. రెండు మూడు ఉదాహరణలు :—

1) "అల కలల్ల లాడగ గని" అని మొదలయ్యే మధ్యమావతి రాగకృతిలో త్యాగరాజులవారు "ఆడగగని" అనే అక్షర సముదాయాన్ని అర్థవంతంగా కూర్చి, మధ్యమావతి రాగసంచారంలో ఎక్కడ అతి సుందరంగా అమురుతుందో అక్కడ కుదిర్చి పాడడంలో ఉన్న నాదోపాసనా ప్రతిభను సంగీత కళానిధి శ్రీ టి. వి. సుబ్బారావు గారు సానురాగంగా ఎత్తి చూపించారు. "ఆడగగని" అని పాడేటప్పుడు స్వర గమకం రిషభమధ్యమాల రెండిటి మధ్యా ఊగిసలాడుతూవుంటే, ఆ వూగిసలాటలోనే, ఆ అల్లల్లాడడంలోనే, శ్రీరామచంద్రుని సొగసైన ఫాలంమీద అందంగా చిందులువేసే అలకల (ముంగురుల) వొయ్యారాలు అతి సుందరంగా ప్రస్ఫుటం అవుతాయి అని వారు ఆర్ద్రతనిండిన రచనలో వివరించారు. అయితే పాడేవారు రిషభ మధ్యమాల మీదే మనస్సంతా లగ్నం చేసుకోక మనోనేత్రంతో ఆ రాముడి అలకల సొబగులు, చిందులూ, వొలయాటలూ చూస్తూ, మనోశ్రవణంతో రిషభ మధ్యమాలు వింటూ మధ్యమావతిని సమాశ్లేషిస్తే రసానందంవారినీ, వినే వారినీ సహస్రారానికి లాక్కుపోతుంది!

2) అదే విధంగా "గిరిపై నెలకొన్న" అని మొదలయ్యే శహనరాగకృతిలో పల్లవి పాడేటప్పుడు మంద్ర మధ్యమంనుండి, తార మధ్యమం వరకూ స్వర సంచారం ఉదహరిస్తూ, ఉన్నతమైన ఒక కొండ, పర్వతం అడుగుమెట్టునుంచి శిఖరం వరకూ ఉండే అంతరౌన్నత్యాన్ని మనోనేత్రం ముందు ప్రత్యక్షంచేసే శక్తి ఆ స్వరసంచారానికి వున్నదని శ్రీ సుబ్బారావు గారు విపులీకరించారు. ఇది త్యాగరాజస్వామి వారి కృతులలో విశదమయ్యే "స్వర-పద భావ" సమన్వయంలో ఉన్న విలక్షణమైన ప్రతిభ!

3) సంగీత జ్ఞాన మెక్కువగా లేక, యీ స్వరపద సమన్వయంలోని సొబగులు అవగతం కానట్టి శ్రోతలకు కూడా ఈ విచిత్రమైన ప్రతిభ స్థూలంగా, అలవోకగా విదితం అవుతూనే ఉంటుంది-పాటలూ వింటూ, పదాలకి అర్థాలు జ్ఞాపకం చేసుకుంటూంటేను :—

i) ''హెచ్చరికగా రార'' అని ఉత్సాహపు టుబలాటంతో ఆరంభించే కృతిలో, యదుకుల కాంభోజిలో ఉచ్చరించే ''హెచ్చరిక'' అనే పదం మామూలు హెచ్చరిక కన్న హెచ్చయిన హెచ్చరికనే యిస్తుంది !

ii) ''చక్కని రాజమార్గము'' అని మొదలయ్యే కృతిలో ''చక్కని'' అనే పదం ఖరహర ప్రియరాగసంచారాల్లో అనేక చక్కదనాల్ని సమకూర్చు కొని, ఆ చక్కదనాలలో తన చక్కదనం, చక్కగా ప్రదర్శిస్తూ, శ్రోతలను మనోవీధుల్లో చక్కని రాజమార్గాన్ని యింకా యింకా చక్కగా సాగించి నిర్మిస్తుంది.

iii) హిందోళ రాగచ్ఛాయలలో ''సామజవరగమనా'' అని మళ్లీ మళ్లీ పాడుతూవుంటే, హుందానడకల అంబారీ యేనుగు మన మనస్సుల ముందర ఏనుగు నడకలే నడుస్తుంది అంతేకాదు అనురాగమూ, ఆర్ద్రితా నిండినట్టిదాన్ని, ఆ వినే మనస్సుని, సంగీతపు టేనుగు నెక్కించి, త్యాగరాజ వందనీయుడై, మురళీవాదన వినోదుడైన ఆ శ్రీకృష్ణ పర మాత్ముల దివ్యపదసాన్నిధ్యానికే తీసుకొని వెడుతుంది !

ఈలా చెప్పుకుపోతే త్యాగరాజు స్వామి సంగీతయుత భక్తికవితా వైభవం ఇంద్రచాప సౌభాగ్యంతో దర్శనమిస్తుంది. ఒక్కొక్క కృతిని విపులంగా వివరించాలనుకుంటే మనస్సుకు కలిగే సౌభాగ్యం యింతా, అంతాకాదు. అయితే ఎంత ఏరుకున్నా, ఈ రత్నగర్భవంటి కృతి సముదాయంలో భావరత్నాలు యింకా దొరుకుతూనే ఉంటాయి-అక్షయ పాత్రలా యివీ అనిపిస్తూ. ఆ వైభవంలో సూచనాప్రాయంగా ఉదహ రించుకోవలసినవి కొన్ని—

i) నడక, శైలి, ధారాశుద్ధి (ఏలనీదయరాదు, (అఠాణా) లో లాగ)

ii) శబ్దాలు పేర్చికూర్చడం (నారదగానలోల (అఠాణా) లో లాగ)

iii) గొప్ప విషయం చిన్న మాటలతో చెప్పడం (ముమ్మూర్తులు (అఠాణా) లో లాగ)

iv) పూజావిధాన సూచనపాటల్లో ( నీనామరూపములకులో మంగళ హారతి పట్టడం)

v) పదచిత్రాలు (పతికి హారతీరే-సురటి రాగకృతిలోలాగ)

vi) లోక వ్యవహారోపములు (నీవల్ల గుణదోషమేమి (కాఫీ) రాగ కృతిలోలాగ)

vii) నానుడులు (గంగాసాగరం (కల్ల) అనేపదం, చక్కని రాజ మార్గ కృతిలో)

viii) జీవిత సత్యాలు (ఎంతనేర్చిన కాంతదాసులె, శాంతము లేక సౌఖ్యము లేదు, మనసు నిల్పశక్తి లేకపోతే మధురఘంట విరుల పూజ యేమి సేయును ? లాగ)

ix) అసాధారణ ఉపమలు ( ఉరగములు పెనగినట్లున్నదట తన మనస్సు)

ఈలాగ చెప్పుకుపోతే ఎన్నైనా ఉన్నాయి. ఇవి ఉదహారణలు మాత్రమే. తెలుగు వారి సౌభాగ్యమూ అంటూ సంగీతం ధ్వనించే కవిత్వాన్ని బమ్మెర పోతరాజులవారు ప్రసాదించారు; కవిత్వం ధ్వనించే సంగీతాన్ని త్యాగరాజులవారు ప్రసాదించారు. ఆ సరస్వతీ కుమద్వయ ప్రసాదలబ్ధమైన ఆలోచనామృతాన్నీ ఆపాత మాధుర్యాన్నీ ఒక్కసారిగా ఆస్వాదించి సుషుప్తినందే ఆత్మానుభవం బ్రహ్మానందం ప్రసాదించారు!

# * పంచరత్న కీర్తనలు

శ్రీ త్యాగరాజ స్వామివారు రచించిన కీర్తనలన్నీ భక్తి ప్రపూరితాలైన రసగుళికలు; సంగీత సంప్రదాయంలో అత్యున్నత శిఖరాన్నలంకరింపదగ్గ స్వర గుళికలు; తెలుగు నుడికారంలోని సొంపుల, తీపి తమలో అంతటా నిండేటట్లు సంతరించుకుని భావార్థ సుశోభితాలైన మధుగుళికలు! వందల కొద్దీ ఉన్న కీర్తనలలో దేనికదే ప్రత్యేక శోభతో రాణించే మణివలె వెలిగిపోయినా, పంచ రత్న కీర్తనలని చెప్పుకోబడే ఐదు కీర్తనలు, ప్రత్యేక ప్రతిష్టతో, ఉత్తమోత్తమ స్థానార్హాలుగా ప్రసిద్ధికెక్కాయి. స్వరాల బిగిలో, కూర్పులో, సంగీతపుటుదాత్తతలో వాటి మహత్త్వత బహుధా ఉగ్గడింపబడింది. కర్ణాటక సంగీత ప్రపంచంలో హేమాహేమీలందరూ, త్యాగరాజస్వామి వారి ఆరాధనాక్రమంలో ఈ ఐదు పాటల్నీ, మేనలు మరచి, మనసులు లగ్నం చేసుకుని, ముక్త కంఠాలతో, భక్తిభావం వెల్లివిరిసేటట్లు గానం చెయ్యడమే సద్విధిగా ఎంచుకుంటారు! సంగీతపు విలువలలో యీ కీర్తనల నాణ్యత సంగీతజ్ఞులకూ, తద్వారా శ్రోతలకూ సుపరిచితమే. మిగిలిన కీర్తనలకన్న వీనిలో చరణాల సంఖ్య పెద్దది. (పల్లవి అనుపల్లవి గాక ఎనిమిదిగాని పదిగాని చరణాలుంటాయి ఒక్కొక్క పాటకి). ఒక్కొక్క చరణంలో కూడా సుదీర్ఘమైన కూర్పు; శబ్దాల సంతరింపులోని విశిష్టత; భావప్రసారంలో నైపుణ్యం; యీ మొదలైన నైజాలు కూడా శ్రోతలకూ, పాఠకులకూ చాలావరకు అవగతం అవుతాయి. ఇంకా విమర్శనా దృష్టితో పరిశీస్తే, త్యాగరాజులవారు తన భక్తిబోధనామృతాన్నంతా యీ కీర్తనలలో యిముడ్చివేసినట్లు తెలుస్తుంది. అంతేకాదు, యీ ఐదు రత్నాలనీ (పంచ రత్నాలనీ) ఒక ప్రయోజన సూత్రంతో బంధించి రత్నాలహారాలగా సంతరించి సంఘటించినట్లనిపిస్తుంది. వీటిల్లో ఒక క్రమం, ఒక పద్ధతి, ఒక సంపుటీకరణం స్పష్టంఅవుతుంది.

నాట, వరాళి, గౌళ, ఆరభి, శ్రీరాగాలలో యీ కీర్తనలు నిబంధింపబడినాయి. ఈ ఐదింటినీ ఘనరాగాలంటారు. వాటి స్వరసాహిత్య ప్రక్రియ

అత్యుత్తమ స్థాయి నందుకోవడం వీటిని ఘనరాగాలంటారుట* అటువంటి ఈ ఘనరాగ పంచకంలో రచించారు త్యాగరాజస్వామి ఐదు సర్వోత్కృష్ట వాక్ప్రబంధాలనదగ్గ కృతులని, పంచరత్న కీర్తనలని.

ఆ ఐదు కీర్తనలనీ పరిశీలన కోసం యీ క్రమములో ఉదహరించు కోవచ్చు :

| | | |
|---|---|---|
| నాట రాగంలో | "జగదానంద కారక... | అని మొదలయ్యే కీర్తనలు |
| వరాళి రాగంలో | "కనకన రుచిరా | |
| గౌళ రాగంలో | "దుడుకుగల నన్ను... | |
| ఆరభి రాగంలో | "సాధించెనే, మనసా... | |
| శ్రీరాగంలో | "ఎందరో మహానుభావులు | |

వీనిలో మొదటి రెండు పాటలూ వర్ణనాత్మకాలూ - సంబోధనాత్మకాలూను. త్యాగరాజస్వామి, ఆ శ్రీరామచంద్రుని అనేక విధాల వర్ణించి ప్రత్యక్షం చేసుకుంటారీ రెండు పాటల్లో! "జగదానందకారక" సంస్కృత సమాసాలతో నిండిపోయింది. పూర్వగాధలనీ, రామాయణంలో అనేక సన్నివేశాల్నీ స్ఫురింప చేసే బహు వ్రీహి సమాసాలలో, ఆ జానకీ ప్రాణ నాయకుని జగదానందకారకునిగా ప్రత్యక్షం చేస్తుంది. రాజరాజేశ్వరునిగా, పురాణ పురుషునిగా, నిర్వికారునిగా, అగణిత గుణునిగా సృష్టి స్థిత్యంత కారకునిగా, ఆ దేవదేవుని నిరూపించి, త్యాగరాజ స్వామి వారు తన్ను తరింపజేసుకున్నారు. పది చరణాల్లోనూ పదజాలం గుప్పించి, బహు విధాల వర్ణించి, కృతకృత్యులైనారు. చివర మూడు చరణాల్లోనూ శ్రీరామచంద్రుని. త్యాగరాజనుతుని ముమ్మారు స్మరించి (మకుటం ప్రతిపాటలో ఒక్కసారే ఉంటుంది మామూలుగా) తన్ను తాను పునీతుని చేసుకున్నారు. పదప్రయోగంలో త్యాగరాజస్వామివారికున్న ప్రతిభ యీ కృతిలో బహుళం గానే కన్పిస్తుంది.

---

*ఇరువదిరెండు శ్రుతుల కలయికకు ఆస్కారములు కావడంచేతనూ. వీణలో యీ రాగాలని గానంచేసేటప్పుడు తానవిస్తరణకి ఎంతో అవకాశం ఉండడంచేతనూ వీటిని ఘనరాగాలంటారు. సంగీతకచ్చేరీలలో ఆది నాట, అంత్య సురటి అనే సంప్రదాయం కూడా చెప్పుకుంటాం! ఈ ఐదున్నూ మంగళప్రదమైె సుస్వరశోభితములైన రాగశ్రీలు!

''కనకన రుచిరా'' అని మొదలుపెట్టే వరాళిరాగకృతిలో అలా నాటరాగ కృతిలో ప్రత్యక్షమైన దేవదేవుని త్యాగరాజస్వామి సానురాగంగా చూసిచూసి మురిసిపోతారు. ఆ పరమ భక్తుడైన ఆ వనజనయనుని మోము చూచుటే జీవన మని నెనరు గలవాడిని గానని "ననుపాలింప" అనే మోహనరాగకీర్తనలో చెప్పుకున్నారు. అట్టి పరమభక్తుడీకృతిలో, దినదినమును, చనవుతో, తన మనములో ఆ శ్రీరాముని చూచినకొద్దీ రుచి హెచ్చుతుందనే సిద్ధాంతాన్ని ప్రస్తావించారు; ప్రతిపాదించి స్థిరీకరించారు. తాను చూచే రాముడు కనకవసనుడు; పాలుగారు మోమున శ్రీ అపార మహిమతో తనరువాడు; మణిమయ మాలాలంకృతకంధరుడు; సురుచిర కిరీటధరుడు. కాని ఆ సిద్ధాంతానికి బలంగా తానిచ్చిన సాక్ష్యం ఒక్కటే చాలదనుకుంటారేమోనని, రామనామ రసికుడైన కైలాస సదనుడు (శివుడు), పవమాన సుతుడు (ఆంజనేయుడు), నారద, పరాశర, శుక, శౌనక పురందరులను నగజను (పార్వతిని), ధరజను (సీతను) సాక్షులుగా పేర్కొంటారు. అటువంటి చూచినకొద్దీ రుచి హెచ్చే శ్రీహరిని ధ్యానించి, మనస్సులో చూసుకుంటూ మురిసిపోయే ధ్యానమనన సౌహార్ద్రతా ప్రక్రియకి ఫలసిద్ధి- ధ్రువుడు అందుకొన్న సుగతినీ, సుస్థితినీ, సుసౌఖ్యాన్నీ జ్ఞాపకం చేస్తారు. సీతాంజనేయులు సలిపిన సంవాదాన్ని, చర్చనీ పేర్కొని, తెలిసి, వలచి, సొక్కిన సీతమ్మ, కులుకుచు నోరకనుల జూచిన అతి సుందరమూర్తిని ఆ రాముని తాను గూడ ఆదేవసిగా చూచి చూచి తరించారు. ఈ కృతిలో తెలుగు పదాలే ఎక్కువగా ఉన్నాయి. రెండు చరణాల్లో సంస్కృత సమాసాలు బహుళమైనా మిగిలిన పాటలో సామాన్య పరిభాష అనిపించే తెలుగు పదాలే ఎక్కువగా ఉన్నాయి.

అల్లా ఆ రెండు కృతుల్లోనూ ప్రత్యక్షం చేసుకున్న పరదైవతం, ఆ పరమాత్మ, కడుమర్విషయాకృష్టుడైన ''తన్ను'' రక్షించి దయతో బ్రోచునా అనే సందేహాన్ని, గౌళరాగంలో దుడుకు గల అనే కృతిలో ప్రస్తావిస్తారు, త్యాగరాజస్వామి. "కనకనరుచిరా" అన్నపాట చివర ఉదహరించుకున్న ధ్రువుడు సజ్జనుడు; సాపత్నిమాతయైన సురుచి కర్ణశూలములైన మాటలు, వీనులచురుక్కుమనిపించినా, పల్లెత్తుమాటైనా తిరిగి అనకుండా కార్యశూరుడై, వినయకవచుడై, కృతకృత్యుడైన ప్రయోజకుడు ఆ ధ్రువుడు!

ఆలా ధ్రువోపాఖ్యానం జ్ఞాపకంతెచ్చుకున్నా వస్తుతః తాను ఆ ధ్రువునికి సమానుడను కానన్న కించవల్ల తన కాతని మల్లే సమానఫలసిద్ధి అబ్బదేమో అనే సందేహం కలిగింది. తనకు దుడుకు ఉన్నదని ఆలోచించుకుంటారు. తన స్థితిని పూర్తిగా వివరించుకునే ప్రయత్నంచేసి, ఆ ప్రయత్నంలో పదే పదే తన్ను కించపరచుకుంటారు — యీ గౌళరాగకృతిలో. సౌఖ్యపుజీవనం కోసమే కాలం గడుపుతూ, దుర్విషయములను దురాశలను విసర్జించలేక, పరధనముల నాశించి, వానికొరకు ఇతరులను పొగడి, మది కరుగ యాచించి పలికి, కుతర్కుడై రసవిహీనుడై, కులభ్రష్టుడై కాలము గడిపే దుడుకు — మానవతను సాధింపక, చపలచిత్తుడై, మదమత్సర కామలోభ మోహములకుదాసుడై, చిఱుత ప్రాయమునాడె భజనామృతసార విహీనుడై, సతత మపరాధియైనట్టి వాని దుడుకు — సతులకై కొన్నాళ్లు, ఆస్తికై కొన్నాళ్లు, ధనతతులకై కొన్నాళ్లు, తిరిగి శ్రమిస్తూ, పరస్త్రీలను, నీచస్త్రీలను కామించి అనుభవించి, శ్రీహరిపదాబ్జభజన మఱచి, సకల భూతములయందూ తానై, యున్న ఆ దేవుని తన మదిలో మాత్రమే లేకుండ చేసుకున్న దుడుకు — ఈ రీతిగ అనేక రకముల దుడుకులు గల ''తన్ను'' — నికృష్టుని, "బ్రోచే దొరకొడుకు" వారసత్వపు ప్రభుత్వంగల వాడెవ్వడూ అని పృచ్ఛచేస్తారు. ఈ ప్రశ్నకు జవాబు యీ పాటలో లేదు. కాని నాలుగవ పంచరత్న కీర్తన, ఆరభిరాగంలో "సాధించెనే మనసా" అనే కృతిలో సంతరించారు త్యాగరాజస్వామి. ఈ గౌళరాగ కీర్తన యొక్క ప్రయోజనం అంతముఖ్యమైన ప్రశ్నను రేకెత్తించడమే; త్యాగరాజు స్వకీయనిందమాత్రం కాదు, ఆ పరమ భాగవతుడు తన్నంతగా కించపరచుకుని తిట్టుకోవడం సమంజసమూ కాదు. అటువంటి దుడుకాయనకున్నదనడం సత్యమూ కాదు. స్వామివారి సత్ప్రవర్తనా, పవిత్ర జీవనమూ అందరూ ఎరిగినవే. వేరొకచోట స్వామివారు త్యాగరాజాప్తునిగా శ్రీరాముణ్ణి పొగడడం నారదమౌని తపస్సుకే ఫలపరమావధి అన్నట్టు చెప్పారు. త్యాగరాజు శబ్దం శివునికి కూడా వర్తించినా కృతులలో అది తన సంతకమే, తను రచించిన విషయాన్ని సూచించే సంకేతమే అవుతుంది. "త్యాగరాజాప్తుని పొగడ నారదమౌని తపమేమి చేసెనో" అని యదుకుల కాంభోజిలో అనేసి తనపై తనకున్న ఆత్మ విశ్వాసాన్ని ప్రకటితం చేశారు. కనుక యీ గౌళరాగకృతిలోని "దుడుకు మానిసి" త్యాగరాజస్వామి మాత్రం కాకూడదు. ఆ పాట నేను పాడుకుంటే ఆ "నన్ను" నాకే చెంది ఆ దుడుకు

గల మనిషిని, కొన్ని దుడుకులేనా ఉన్న మనిషిని, నేనే అవుతాను. అంచేత ఆ పాట పాడుకునే జిజ్ఞాసువులకు ఆ మాట చెందుతుంది. ఇక పాటలోని ప్రతి పాదనా, ప్రశ్నా జనసామాన్యానికి అన్వయించుకుంటే, అంత హైన్యస్థితికి దిగ జారిన వారికి మోక్షం ఎల్లాగా అనే సామాన్య ప్రశ్నా, దానికి జవాబూ దొరుకు తాయి: తానెంత దైన్యస్థితికి దిగజారినా, ఎంత బరువు బ్రతుకు గడుపుతున్నా, ఎంత నికృష్టుడైనా ఏ మానవుడూ నైరాశ్యత చెందనవసరం లేదనీ, బ్రోచి రక్షించే దొరకొడుకు ఎవరూ అని వెతుక్కుంటే దొరకుతాడనీ వ్యంగ్యంగా సూచించారు గురూత్తములైన త్యాగరాజస్వామి. జగదానందకారక'' లోని శరణాగత జనపాలకుడూ, "కనకనరుచిరా'' లోని పరమదయాకర, కరుణారస వరుణాలయుడూ అయిన జానకీ ప్రాణనాయకుడే ఆ దొరకొడుకు ! దశరథ దొర కొడుకు—దాశరథి !

"సాధించెనే మనసా''లో ఆ దొర కొడుకైన దాశరథి, త్యాగరాజ నుతుడు. తన భక్తుని చెంతరాకనే, అమరికగా నాతని పూజగొని, సమయానికి తగు మాటలాడి, సౌఖ్యపుబ్రతుకు గడపడానికి ప్రయోజనకారకములయ్యే వ్యవహార సూత్రాలు నిర్దేశిస్తాడు. ఆ భగవంతుడు ముచ్చటగా మూడే సూత్రాలు చెప్పాడు :

అలుగవద్దు, అన్నాడు.
విముఖులతో చేరబోకు, అన్నాడు.
వెతగలిగితే తాళుకొమ్మని, అన్నాడు.

రఘుకులేశుడైన రామచంద్రుడు, స్వప్రకాశుడైన శ్రీ వెంకటేశుడు వేడు కున్నా తన్నుబ్రోవక, యీ మూడు సూత్రాలు పలికి తిరిగిపోయినాడన్నారు. పరమభక్తవత్సలుడని, కలబాధల దీర్చువాడని, ఒక అభయహస్తముద్రతో తన్ను తిన్నగా మోక్ష స్థితికే చేర్చివేస్తాడనుకొని వేడుకుంటే, దగ్గరకైన రాకుండానే, దూరాన్నే నిలిచి, యీ ప్రకారంగా నడచుకొమ్మని ఉపదేశించి చక్కాపోయినట్లు చెప్పి, చమత్కారంతో విశేష ప్రయోజనం సాధించారు దేశి కోత్తములైన త్యాగరాజస్వామి ! ఏ ఆచార్యుడైనా జీవిత క్రమానికి సంబంధించిన నిబంధనలు వక్కాణించి చెప్పితే, అవి సామాన్యంగా శిష్యుల మనస్సులకెక్కవు. కాని త్యాగరాజస్వామి వంటి సత్పురుషుడు, తనను, ఆ పరబ్రహ్మమైన శ్రీ వేంక

వేసడే అయినా నిబంధనలని సూచించావని చెప్పుతూ ఉంటే, ఆ పరదైవాన్ని ప్రత్యక్ష దైవంగా ఎంచుకునే కలియుగ మానవులు ఆ మాటలపై నమ్మకమూ, స్వామి వారికిలో గురుత్వమూ కుదుర్చుకొనకుండా ఎలా ఉండగలరు? తాను చెప్పదలచుకున్న పాఠాన్ని పరోక్షంగా, అందులోనూ ఆ పరమాత్మ నోటితోనే చెప్పించడం త్యాగరాజస్వామి వారి నేర్పరితనం. "శాంతము లేక సౌఖ్యము లేదు'' అని వేరొకచోట తానై నిశ్చయించుకొన్న త్యాగరాజస్వామి యీ పంచరత్నకృతిలో, "అలుగవద్దు'' అని దేవదేవుని చేతనే (మళ్లీ) చెప్పించారు.

ఈ పాటలోని యింకొక చమత్కారం ఏమిటంటే, ఆ చెప్పిన పరమాత్ముడు, సమయానికి తగుమాటలాడినవాడు, మామూలుగా తాను పూజించి, మనస్సులో దర్శించి పరవశించెందే జానకీ ప్రాణనాయకుడుకాడు-రుక్మిణీ ప్రాణ పదు! రంగేశుడూ, సద్గంగా జనకుడూ, సంగీత సాంప్రదాయకుడూ అయిన శ్రీకృష్ణుడు ఆ శ్రీకృష్ణుడైనా, తానూ యింకా మిగిలిన భక్తులూ ఈవరలో సందర్శించిన మూర్తి-''అలివేణువెల్ల దృష్టిచుట్టివేయుచు, మ్రొక్కే వేణుగానలోలుడు కాడు- రాసక్రీడలాడే యువకుడుకాడు- పెంకె గోపాలుడు; గోపీజన మనోరథ మొసంగలేకనే గేలియుజేసెడివాడు; పుట్టిన మరుగడియనుండీ వారికి గాక పరులవాడై దేవకీ వసుదేవుల ''నేచిన'' వాడు; నిజ తనయుడను భ్రాంతితో యశోద ముదంబునను ముద్దుబెట్ట (ఆవిడమాయా మోహితత్వానికి?) నవ్వుచుండు హరి; వనితల సదా సొక్కజేయుచు, అందులకై తనకు మ్రొక్కించుకునే గడుసరి; "అలుగవద్దు'' అని తనకు బోధించిన సన్మార్గ వచనములను (తానే) బొంకుజేసి తాపట్టిన పట్టు (మారాన్నుంచి కబుర్లు చెప్పడమేగాని, దగ్గరకొచ్చి, లాలించి ప్రేమించి మోక్షమియని పెంకెపట్టు-తానే కోపించినాడా అన్నట్లు) అలాంటి పట్టును ''సాధించెనే'' అంటారు త్యాగరాజస్వామి! ఆ మాటను పల్లవిలోనే అని మళ్ళీ మళ్ళీ అనుకుంటారు! ఇటువంటి విరుద్ధ ప్రవృత్తితో పరమాత్ముడు తనకు ప్రత్యక్షమయ్యాడన్నారు. తాను కోరి పూజించుకునే ఇష్ట దైవం వేరు – ఉరమున ముత్యపుసరులచయముతో, కరమున శరకోదండ కాంతితో, చక్కనిరాముని గేరుమోముగల సుదతి సీతమ్మ, సౌమిత్రి యిరు ప్రక్కల నిలబడి సేవించే ఆ కోదండపాణుడు కాడు! ఆ స్థానంలో యీ గోపాలుని నిలుపుకొనడంలో త్యాగరాజస్వామి వారందించే పాఠం యేమిటో

మనం ఊహించుకోవాలి—ఆశించిన ఫలం అదే రూపంలో అందకపోతే క్రుంగిపో కూడదు అనే పాఠాన్ని అందించారా ? కావాలన్నప్పుడూ, అనుకొన్న రూపంలో దేవుడు దొరకకపోవచ్చుననీ, యింకో రూపంలో ప్రత్యక్షం కావచ్చుననీ—స్వర్గానికి నిచ్చెనగా దేవతామూర్తి నుపయోగించుకోబోతే, వెంకె గోపాలుని మూర్తిలో ప్రధానోపాధ్యాయుని లాగా, జాగ్రత్తగా మసలు కొమ్మని పాఠాలు చెప్పవచ్చుననీ, అయినా ఆ బోధనే మహా ప్రసాదమని స్వీకరించాలనీ, అలాటి సత్ప్రవర్తన వల్లనే విముక్తి దొరుకుతుందనీ చెప్పడమే త్యాగరాజుల వారి తాత్పర్యమేమో ననిపిస్తుంది. ఇంకొక ఆలోచన — అతుల శౌర్య విభాసియైన పార్థుని కనిమొనలో సారథ్య మొనరించి, ఆతడు విషాదయోగగ్రస్తుడై యుండగా, కర్తవ్యము నుపదేశించిన దేశికమూర్తి, జగత్తుకు గీతామృతమును ప్రసాదించిన జగద్గురువు, ఆ శ్రీకృష్ణుడు గనుక, గీతా బోధను గుర్తులో నుంచుకొని, తన రామునిచే పాఠాలు చెప్పించక, ఆచార్య స్థానంలో ఆ కృష్ణుని నిలబెట్టడం సమం జసమే అనిపిస్తుంది. ఏది ఏమైనా, సుశీలమే అవశ్య కర్తవ్యమని, త్రిసూత్రాత్మకమైన గురు బోధను అందించింది యీ ఆరభి రాగపుటమోఘ కీర్తన !

ఆ, యీ ప్రకారంగా నడచుకొంటూ, ప్రవర్తనలోనే మహానుభావత్వమును సిద్ధించుకొమ్మని, ఆదేశించి వదలి వెయ్యడం సులభమే. వెంకెగా, ఆ పాఠము చెప్పి, వెనుదిరిగి వెడలిపోయిన ఆ నవనీత చోరునికి మల్లేనే తాను కూడా యీ ఆరభి రాగ కీర్తనతో యీ సంపుటీకరణం ఆపివేస్తే సమంజసం కాదని, అల్లా ప్రవర్తనలో మహానుభావత్వము సిద్ధించుకున్న వారెందరో ఉన్నారు అని దాఖలా చూపించడానికా అన్నట్లు ఐదవ ఘనరాగ పంచరత్న కీర్తనను తలమానికపు కృతిగా వ్రాశారా అనిపిస్తుంది ! (రామదాసులను మహా భక్తుడొకడు, గంగా తీరమునుండి ప్రత్యేకముగావచ్చి త్యాగరాజస్వామివారి యింట్లో దేవతా సన్నిధిని పాటలు పాడి, తనకు స్వప్నమునందు దేవుడు కనపడి, ఆలా స్వామివారిని దర్శించ మని చెప్పితే—ఆ సందర్భంలో యీ పాట పాడారన్న గాథ ఉన్నది) రాగాలకి రాజు శ్రీరాగం అంటారు. ఘనరాగాలలోనే ఘనత చెందినది ఆ రాగం; పేరు లోనే శ్రీ, శారీరంలో సంగీతశ్రీ నింపుకొన్నది. ఆ రాగంలో మాటల పసందుతో స్వర వైశిష్ట్యంతో, గతి శ్రేష్ఠతతో, అతి హుందాగా సాగిపోతుంది యీ కృతి. సదాచారులై, సద్గుణ సంపత్తి గల మహానుభావుల నందరినీ వినయంతో జ్ఞప్తికి తెచ్చుకోవడమే యీ కీర్తనలోని విషయం. వారందరూ వందనార్హులే అని ఉద్ఘా

చూస్తూ వారందరికీ నమోవాకా లందచేస్తారు త్యాగరాజ స్వామి ! ఈ పాటలోని శైలి అతి సుందరమూ, మధురాతి మధురమూను. ఆ మహాను భావులలో పండితులూ, పామరులూ, సంగీత ప్రియులూ, సంఘ సేవకులూ, మహర్షులూ, మనీషులూ యింకా యెందరెందరో ఉన్నారు :-

చందురువర్ణుడైన ఇందిరావల్లభుని అందచందములను, తమ హృదయార వింద మున జూచి, బ్రహ్మానందమనుభవించువారు; తమ స్వాంతములను సరోజ ములను ఆ సరోజనయనుని పాదములకు సంకోచింపక సరగున సమర్పణము చేసి పూజించువారు; సామగానలోలమనసిజలావణ్యమూర్ధన్యులై స్వరలయాది రాగములను దెలిసినవారై, పతితపావనుని నిజమార్గము పాడి తరించేవారు; మానసమను వనచరము (కోతి) యొక్క సంచారము నిలిపివేసి, హాయలు మీరనగలుగల్గు సరసుడైన ఆ పరమాత్ముని మూర్తి బాగుగ వీక్షించి, తదేకంగా కన్నులతో చూచుచూ, పులకశరీరులై, ఆనందపయోధి నిమగ్నులైనవారు; హరిగుణ మణిమయ సరములు గళమున శోభించుచుండ తమ తెలివితో, చెలిమితో సాటి మానవులను (జగమెల్లను) తమ అమృత దృష్టితో బ్రోచి రక్షించే పుణ్యవర్తనులు; వీరూ ఆ మహానుభావులలో కొందరు. పురాణ ప్రసిద్ధులైన మహానుభావుల నెందరినో కూడ పేర్కొన్న తరువాత, ఆ రఘువరుని రూప నామ వైభవము లెరింగి, గుణభజనానంద కీర్తనచేయు సద్భక్తులను ఆ మహానుభావుల పట్టిలో చేర్చారు. పురాణ, ఇతిహాస, శాస్త్రనుత గ్రంథ విజ్ఞానములను అలవరచుకొన్న పండితులనూ, దేవతలకు సన్నిహితులై, సంగీత ప్రియులై, భావమును, రాగమును, లయను (ఆ క్రమములో) ఆకళించుకొన్న సంగీతజ్ఞులై, ఆ సంగీతానుభవము వల్ల క్షణకాలంలోనే యుగ ప్రమాణ సమానమైన ఆనందానుభూతుల నందుకొని, ఆ సౌఖ్యమునందుటచేత చిరాయువులనదగ్గవారు అట్టి చిరానుభూతులనందగల్గిన పుణ్యపురుషులనూ మహానుభావుల పట్టీలో చేర్చారు. తొమ్మిది చరణాలు యీ ఉదాత్త రీతిలో నడిపించి, త్యాగరాజ మకుటమును ఆ నవమ చరణాంతాన్న తెలిపిన తరువాత, ఇంకొక రకమైన మహానుభావులను తన పట్టిలో చేర్చలేదన్న సంగతి జ్ఞాపకమునకు రాగా ఇంకొక చరణమును త్యాగరాజులవారు వ్రాసినారని

తోస్తుంది. పదవ చరణములో, కేవల నామమును ''తలచుచూ'' (పైకి అనడం కాదు) ముదితావస్థ నొంది లోలోపల ప్రమోదితులయ్యే భక్తులను, రఘుప్రవరుని ప్రేమ ముప్పిరిగొనగా, అతని నామమటుల తలచే నిజదాసులను మహానుభావ పదార్థులుగా నిర్వచించి తనకు వందనార్హులని నిర్ణయించి, ఆ దశమ చరణాంతాన్న త్యాగరాజు మకుటం నిలిపి, తన ప్రాభవాన్ని నిల్పుకున్నారు. కేవల నామచింతనలో నిగూఢమైన నిర్భరభక్తి సలవరచుకొన్న పామరుల భక్తికి గూడ మహానుభావత్వము (అనుభవ అనుభూతులలో శ్రేష్ఠత)ను నిరూపించి, గజేంద్రుని కున్నటువంటి పామరభక్తి సైతము, మోక్షకారకము అవగలదనే పరమ సత్యాన్ని స్ఫురింప చేస్తారు. ''సాధించెనే మనసాలో అంతాన్న కర్మమార్గాన్ని'' (సత్ప్రవర్తనని) — ఎందరో మహానుభావులలో అంతాన్ని ''భక్తి మార్గాన్ని'' ప్రత్యేకంగా ప్రస్తావించి, తత్త్వ బోధనాచార్యులైన త్యాగరాజస్వామి గురూత్తములుగా కృతకృత్యులైనారు.

మానవ రూపంలో పరమాత్మను అవతారమూర్తిగా దర్శించుకొనే ప్రయత్నంలో ఆ మానవ రూపునికి మానవ సామాన్యమైన గుణములు లేవని, విశేష విపరీత గుణముల నారోపించుకొనడం అత్యవసరం. యీ ప్రయత్నంలో త్యాగరాజులవారు పంచకీర్తనలలో శ్రీరాముని "పరనారీ సోదరుడు'' అని ప్రత్యేకంగా వర్ణించారు. ''ఆజన్మ మనఘుడు'' అన్నారు. ఆది దేవునికి, అవతారమూర్తిగా కాముకత్వం, జన్మము ఉంటే విపరీతము కాకపోయినా — సదా పరనారీ విముఖత్వమే గాక, సోదరభావమని చెప్పి, పుట్టినదాదిగా పాపమే చేయని పవిత్రుడూ అని చెప్పడం అట్టిగుణాలే ఆ పరదేవత్వానికి ఆ మానవరూపుని అర్హుని చేశాయి అని సూచించడమే ఔతుంది. శ్రీరాముడు రాజసుత లలితభాషుడు, అతని పలుకు కండచక్కెరగేరుతుంది అని వేరే కృతులలో వర్ణించిన త్యాగరాజ స్వామి యీ కృతులలో రాముని మృదుసుభాషునిగా, సుధామయ వచో బృంద గోవిందునిగా వర్ణించారు. భగవంతుని ఓంకార పంజరకీరము అన్నారు. ఈ విధంగా వారి కృతులలోనూ వైశిష్ట్యం పరాకాష్ఠ నందినది పంచరత్న కీర్తనలలో.

ఇంత పరమోత్కృష్టతను తమలో నింపుకొన్నయీ పంచరత్న కీర్తనల వైశిష్టతను తెలుసుకున్నాక, త్యాగరాజ సంగీతజ్ఞులైన శ్రీ టి. వి. సుబ్బారావు గారు యీ క్రిందివిధంగా అన్న అభిప్రాయములతో మనమంతా ఏకీభవిస్తాం:

—భగవంతుడు మానవునకు ప్రసాదించిన మహాభాగ్యాలలో అత్యమూల్యమైనదీ ఆతణ్ణి ''ఉద్ధరించేదీ'' యేదీఅంటే సంస్కృతీ, సంస్కారమూ అన్న జవాబు తట్టుతుంది.

—ఆ సంస్కృతీ మహానుభూతులకు కారకమైన వాటిలో మణిపూసలాగా సర్వోత్కృష్టమైనది యేదీఅంటే, అది సంగీతజ్ఞానమూ, భక్తీ అని తట్టుతుంది.

—అటువంటి భక్తి సంగీత సంప్రదాయంలో అత్యుత్తమమైనదేదీ అంటే అది కర్ణాటక కృతి సంప్రదాయ సంగీతం అని తోపిస్తుంది.

—ఆ సంప్రదాయంలో ఉత్తమోత్తమ వాగ్గేయకారులెవరూ అంటే సద్గురు శ్రీ త్యాగరాజస్వామి వారన్నది రూఢిఅవుతుంది.

—ఆ త్యాగరాజ స్వామివారి రచనల్లో అత్యంత ప్రభాసమానములై, ఉత్తమోత్తమంగా శోభించే కృతులేవీ అంటే అవి యీ ఘనరాగ కీర్తనలే అనడం నిర్వివాదాంశం.

"కావ్యేషు నాటకం రమ్యమ్, నాటకేషు శకుంతలమ్ - అందులో చతుర్థాంకం అందులో శ్లోకచతుష్టయమ్'' అన్న పంథాలో కావ్యరమ్యత్వాన్ని వెతుకుతున్నారు. అలాగే సంస్కృతీ మహద్భాగ్యాలు వెతుక్కుంటూ పోతే, సందేహం లేని జవాబు యీ పంచరత్న కీర్తనలు సౌభాగ్యనిధులు!

# * "నగుమోము"

శ్రీరామచంద్రునితో తానుచేసే సంభాషణలు, కవితా హృదయంతో సాగిస్తారు త్యాగరాజ స్వామివారు. తమ మనస్సులో పొంగివచ్చే భావోద్ధతి చల్లారకముందే, అది కృతిరూపంలో వెలువడేది. వేడివేడిగా వున్న ఆ భావాల్ని, వేడి చల్లారకముందే సముచితమైన పదాలమూసల్లో పోసి భావగుళికలు చేసి, శర సంధానప్రజ్ఞాపాటవంతో, తన కృతులను, సంగీతపు ధనుస్సులోంచి (దసరా బాణాల్లాగా) తన రాముడి మీద విరబోసేవారు. ఉదాహరణకి :-

''రామచంద్ర నీదయ, రామ, యేలరాదయా'' అని సురటి రాగంలో ఉన్న కృతిలో పల్లవిలో ప్రశ్నవేస్తారు. ఆ రాముడికి తనమీద దయరాకపోడానికి కారణాలు వెతుక్కుని, ముందుగా ఆ రాముడి మీద తనకున్న అపరిమిత అనురాగ భావనలో, అనుకంపతో, "కాననంపు తాపమో'' ''కైకమీద కోపమో'' అని ప్రశ్నిస్తారు. పదునాలుగేళ్ల అడవుల్లో అనేక శరీర ప్రయాసలు పడ్డాడు తన రాముడు, అలిసిపోయివుంటాడు. ఆ అలసట యిప్పటికీ ఆతడికి తన్ను రక్షించడానికి అడ్డుతగుల్తోంది అనుకుని వేసిన ప్రశ్న మొదటిది. అంత బాధలూ స్వతస్సిద్ధంగా యింకోళ్లమీద, తన బాధలకి కారణభూతులైన వారిమీద, కోపం రావడం సహజంకనుక, అలా కైకమ్మమీద కోపంతో విచలితమైన రాముడి మనస్సుకి తనపై సానుభూతిలేదనే కారణంతోచి, రెండో ప్రశ్న వేస్తారు.రాముడి పరంగా తనపైఉన్న నిర్దయకి కారణాలు వెతుక్కుంటూ, (ఆతడికి Benefit of doubt యిచ్చి - అనురాగంతో) చెప్పుకున్న కారణాలు యివి. ఆవెంటనే ఆ రాముడి వైపునించి తనవైపు దృష్టిమళ్లించి,ఆ సర్వచైతన్యమూర్తికి,మానవాతీతుడికి, శరీరంలో తాపమూ, మనస్సులో కోపమూ ఉండవనుకుని, ఆ మహా మహుడి దయకు తను పాత్రుడు కాలేడనే నిశ్చయానికి వస్తారు. ''సిగ్గుమాలి–'' అన్న కృతిలో కేదారగౌళ రాగంలో, ఎలుగెత్తి ''పన్నగశయన నీ కృపకు నే పాత్రుడు కాలేమ" అని ఆక్రోశిస్తారు. అలాగే యిక్కడ కూడా ఆ నిర్ధారణకు వచ్చి, దానికి సామాన్యంగా ఆలోచించుకుని, అలా జరగటానికి కారణం తనలో

ఉన్నలోపం, అర్హత లేకపోవడం, అనుకుని "నేనుచేయు పాపమో'' అని యింకో కారణాన్ని ఉద్ఘాటించుకుంటారు. కాని ఆ వెంటనే ఆత్మధైర్యం ముందుకు త్రోసుకువచ్చి, తాను పాపం చెయ్యకపోయినా అతడు రక్షించడం లేదని, "నీదు శక్తిలోపమో అని ఆలోచనలతో కూడిన అపహాస్యం పలుకుతారు - మానవతా లక్షణాలని ఆపాదించి, వెక్కిరించి ఉపాలంభిస్తే, ఆ రాముడు తన్ను రక్షించి తనకు శక్తిలోపం లేదూ అని నిరూపించుకుంటాడని! ఈలా క్షణం క్షణం మారిపోయే భావవైవిధ్యాన్ని, ప్రజ్ఞతో, పదాల పోహళింపులో, శరసంధాన ప్రజ్ఞా పాటవంతో గుప్పించే ప్రతిభ కనిపిస్తుంది అనేక కృతుల్లో!

అసలు నాదాత్మను కోదండ స్వరూపంలో శ్రీరామచంద్రుని ఆత్మస్వరూపంగా వర్ణించారు యింకోకృతిలో, త్యాగరాజ స్వామివారు. "నాదసుధా రసంబిలను నరాకృతి ఆయెను,'' అని; ఆ, నరాకృతినంతా క్రోడీకరించి, ఆ రాముని జగద్రక్షకత్వానికి అధికారదండం అయిన ఆయన కోదండంగానే భావించుకుని వర్ణించారు, (ఆరభిరాగంలో). నాదోపాసకుడైన తాను, ఆ రాముణ్ణి మనస్సులో నిల్పుకుని, ఆ రాముడనే సంగీత కోదండం తన మనస్సులో ధరించి, లోకోపకారార్థం, ఆ కోదండ ప్రయోగంచేసి, కృతులనే శరసముదాయాన్ని తన సునిశిత భావాలనే ములుకులు సమకూర్చి మనబుద్ధులకీ మనస్సులకీ హృదయాలకీ సంచలనం కలిగించాలని సంగీత కర్మ వీరుడైన సంగీత సునిశితత్వంతో విసిరారనిపిస్తూంది త్యాగరాజస్వామి. అయితే ఆశరాలు హింసించేవి కావు— ఉద్ధరించే మంత్రాస్త్రాలు! ఇటువంటి శరసంధాన ప్రజ్ఞా పాటవాన్ని, బహుళ ప్రసిద్ధి నందిన యింకో కృతిలో పరిశీలించవచ్చు :—

అభేరి రాగం : ఆది తాళం :

పల్లవి : నగుమోము గనలేని నా జాలి దెలిసి
నను బ్రోవగరావ ! శ్రీ రఘువర ! నీ ॥నగుమోము...

అనుపల్లవి : నగరాజధర ! నీదు పరివారులెల్ల
ఒగిబోధన చేసే వారలు కారే !
అటులుండుదురే ? నీ ॥నగుమోము...

చరణం : ఖగరాజు నీయానతి వినివేగ చనలేడొ (దొ) ? !
గగనాని కిలకు బహుదూరంబని నాడొ?!!
జగమేలే పరమాత్మ ! ఎవరితో మొఱలిడుదు?!!!
వగచూపకు, తాళను, నన్నేలుకోరా, త్యాగరాజనుత-నీ॥ నగుమోము.

పల్లవిలో ఉన్నది ఒక ప్రతిపాదన-ఆ శ్రీరామచంద్రుని చిరునవ్వు సందడించేసుందర వదనం, ''నగుమోము'' తన బహిరింద్రియాలైన, కళ్లతో చూడలేనట్టి ''జాలి'' తనది. ఆ రాముడు తనంతట తాను తన దగ్గరకు వచ్చి తన ముఖంచూపించి, తన కోరికతీర్చి తన్ను బ్రోవగరారాదా, అనే ప్రశ్న ఆ ప్రతిపాదన. ''జాలి'' అంటే యిక్కడ దయకాదు; దైన్యస్థితి; మనస్సులోపడే విచారం శోకం – తానుకోరుకున్నది తనకు లభించనప్పుడు మనస్సుపడే క్షోభ. ఆ రాముని నగుమోము తాను చూడాలి – మనస్సులో తానూహించుకుని ఉబ్బి తబ్బిబ్బై, ఆనందిస్తున్న త్యాగరాజస్వామి ''ముద్దుమోము యేలాగు చెలంగెనో? మునులెట్లుగని, మోహించిరో?'' అని సూర్యకాంతరాగంలో ఆలోచించుకున్నారు. చర్మచక్షువులతో చూడాలన్న కోరిక ప్రబలినా తానాయనదగ్గరకు వెళ్లలేరు. తన రాముడు అవతారం చాలించి వైకుంఠంలో ఉన్నాడు, అక్కణ్ణించి రావాలి. ఇంకోప్పుడు ఇంకొకరి కోసం, అలాంటి కోరిక తీర్చడానికి భూలోకానికి విచ్చేసిన విషయం తెలుసు త్యాగరాజ స్వామికి–భద్రుడి కోరిక ఛటుక్కున జ్ఞాపకం వచ్చి, తటాలున రాముని వేషం ధరించే తొందరలో, నాలుగు చేతుల్లో రెండే ఉంచుకోవాలన్నది మరచిపోయి, శంఖచక్రాలున్న చేతులు అలాగే ఉంచుకుని తాను చతుర్భుజ రాముడై భద్రాచలానికి పరుగెత్తుకొచ్చిన కథ త్యాగరాజస్వామికి బాగా తెలుసు ; రామదాసు కీర్తనల ఛాయలు స్వామివారి కృతుల్లో కన్పిస్తాయి. కనుక ఆలాగే ఆ రాముడు తన దగ్గరకువచ్చి, ఆ భద్రుణ్ణి బ్రోచినట్టే తన్నుకూడా బ్రోవగ రారాదా అనే భావన యెక్కడో మెదిలే మనస్సుతో, తనకు కావలసినది దొరుకక, అది సాధించే శక్తిలేక, దైన్యంలో మున్గిన తన ''జాలి'' తెలుసుకుని తన్ను బ్రోచేటందుకు రారాదా అని ప్రతిపాదిస్తారు త్యాగరాజస్వామి !

త్యాగరాజ స్వామికి తన రాముడిలో కృష్ణుడూ, విష్ణువూ కన్పిస్తూ ఉంటారు. ఒకప్పుడు ''హరే, రామచంద్ర, రఘుకులేశ...'' అని యెలుగెత్తి ఆ రాముణ్ణి రమ్మని పిలుస్తే, ఆయన రాలేదుట! ఆతనికి బదులు ''రంగేశుడు,

సద్గంగా జనకుడు (విష్ణువు) సంగీత సంప్రదాయకుడు, యశోద తనయుడు(గా) ప్రత్యక్షమై, చెంతరాకనే, దూరాన్నుంచే, ''సమయానికి తగు మాటలాడి'' సదాచారాన్ని బోధించినట్లు వివరించారు. ("సాధించెనే మనసా'' అనే ఆరభిరాగ కీర్తనలో). అందుకే యీ అభేరి రాగకృతిలో అను అనుపల్లవిలో "నగరాజధర'' అని కృష్ణపరంగా సంబోధిస్తారు. గోవర్ధన పర్వతరాజాన్ని తన చిటికెన వ్రేలితో యెత్తి, ధరించిన ఆ కృష్ణస్వామి కన్పడ్డాడు మనస్సులో అతనితోబాటే ఆతని చుట్టువారా ఉన్న ఎనలేని పరివారం, నందాది గోపకులూ, గోపికలూ, అందరూ కన పడ్డారు. వైకుంఠంలోని విష్ణువు బొమ్మ ఆకృష్ణుడిమీద కప్పకునిపోయింది; అక్కడ పరివేష్టించిన ఆదిశేషుడూ, లక్ష్మీదేవీ, బ్రహ్మాదులూ కన్పడ్డారు. ఆ పరమాత్మ విగ్రహం తల్చుకుంటే తన పరిసరాల్లో భగవంతుణ్ని గురించి చెప్పే ఆయన అనుయాయులమనే గురువులూ స్వాములూ, గోసాయిలూ కన్పడి ఉంటారు. కాని వీరందరూ కూడా "తన జాలి తెలిసి'' ''ఒగి'' ఒప్పుగా, ఆ దేవదేవుడికి నచ్చ చెప్పి, ఆయనకు తన్ను బ్రోవమని బోధనచేసే వారు కారే! అని వాపోయారు. వైకుంఠంలో ఆయనకి తోచకపోతే చుట్టువారా ఉన్న వాళ్ళైనా చెప్పకూడదా, అల్లా చెప్పేవారు కాక పోయారే అన్న బాధ వ్యక్తం అవుతుంది. నిరాశ, చిరాకూ, ఎత్తిపొడుపూ అన్నీ అభేరి రాగఛ్ఛాయల్లో యీ అనుపల్లవిలో ప్రస్ఫుటం అవుతాయి.

ఈలా పల్లవిలో తన దైన్యాన్ని వివరించి, అది తగ్గే ఉపాయం సూచించి, అనుపల్లవిలో తమరిద్దరికీ ప్రత్యక్ష సమాగమం కల్పించే ప్రయత్నంలో ఇంకెవరూ జోక్యం కలుగ చేసుకోరు అనే నిర్ధారణకు వచ్చి, ఆ విష్ణువు తనంతట తాను భూలోకానికి రావలిసిందే అనే సిద్ధాంతాన్ని బలపరుస్తారు. అంత బలీయమైన సమర్థనీయమైన కారణం ఉన్నా, రావాలని ఆయనకుండే వున్నా (ఉండే ఉంటుంది అన్న నమ్మకంతో) ఎందుకు రాలేదు అన్న విషయం విచారిస్తారు చరణంలో.

మొట్టమొదట వచ్చిన ప్రశ్న, ''ఖగరాజు, నీ యానతి విని వేగ చన లేదా?'' అన్నది. అది ప్రశ్నే కాదేమో? దాని చివర వున్నది ప్రశ్నార్థకం కాక ఆశ్చర్యార్థకం అనిపిస్తుంది. ఆ వాక్యంలో స్ఫురించేది ఎగతాళి, ఆ వెంటనే వచ్చిన రెండవ ప్రశ్నని కూడా కలుపుకుని అర్థం చేసుకుంటే యీ ఎకె సక్కెపు భావనకి యింకా దోహదం లభిస్తుంది. విష్ణువు ''వినతా సుత

వాహనుడై" వెడలిన విషయం త్యాగరాజస్వామికి హరి కాంభోజిరాగంలో స్ఫురించింది, కంచిలో కనిపించింది. కనుక తానై భూలోకానికి రాదల్చుకున్న విష్ణువు "అభ్రభగపతిని పన్నించాడేమో", అనిపించి, అలా పన్నించిన, ఆ ఖగరాజు స్వామి ఆజ్ఞవిని వెంటనే బైలుదేరడా అని నిలువదీసి, ప్రశ్న వేశారు. ప్రౌఢభక్తుడు అతి చనవుతో దేవుడితో ఎక్కెసక్కేలాడేందుకు వేసిన ప్రశ్న యిది! "సిరికిం చెప్పక, శంఖచక్రయుగమున్ చేదోయి సంధింపక, యేపరి వారమ్మును చీరక, అభ్రభగపతిన్ (ఖగరాజుని) పిలిచి తన్ను తీసుకెళ్ళమని చెప్పకుండానే, తానై పదచారియై పరుగెత్తి గజరాజుని బ్రోచిన" కథ-త్యాగ రాజస్వామికి బాగా తెలుసు. "వారణరాజును బ్రోవను వేగమె వచ్చినది విన్నా నురా" అని. "క్షీరసాగరశయనా, చింతలు బెట్టవలెనా" అనే దేవగాంధారి కీర్తనలో రెట్టించారు! అంచేత త్యాగరాజ స్వామివారు ధ్వనింపచేసిన, ఆ పర మాత్మ ఉపేక్ష, ఆ గరుడుని ఔదాసీన్యం, ఆ భగవంతుడి నిర్లక్ష్యం పరుగెత్తుకు రాని నిరాత్రతం, తన జాలి, ఆ యీ విషయాలు అన్నీ కలబోసుకుని, యీవేసిన ప్రశ్నలోని భావాన్ని అనుభవించాలి శ్రోతలు!

ఆ వెంటనే వేసిన రెండవ ప్రశ్న "గగనానికి, ఇలకూ బహుదూరంబు అని అనినాడో" అని! ఈ ప్రశ్న తరువాత ఉన్నవి, ఒకటి కాదు; చాలా ఎన్నో ఆశ్చర్యార్థకాలు. ప్రశ్నార్థకాలు కానేకావు. త్యాగరాజస్వామి వంటి ఉత్త మోత్తమ అర్హత గల భక్తుణ్ణి రక్షించకుండా ఉన్న ఆ దేవుడి ఉపేక్షకు కార ణాలు వెతుక్కున్నా కనపడక, సమంజసపు కారణాలు దొరకనే దొరక్క, స్ఫురించకపోయిన మనస్సుకి యీ వికృతపు పెంకె ప్రశ్నలు వేసే కోపం, చిరాకు కలిగాయన్నమాట! తన్ను రక్షిద్దామనుకున్నా గరుడుడిపైన ఎక్కి వెళ్లాలను కోడం, ఆ గరుత్మంతుడు; "పోనిద్దురూ, ఆ త్యాగరాజు ఉన్న భూలోకం యీ గగనానికి చాలా దూరాన్న ఉంది— అంతదూరం యిప్పుడెవళ్ళెడతారు," అనే సాకుచెప్పి బైలుదేరకపోతే, ఆతని ఆ బద్ధకాన్ని ఒప్పుకుని అసలు రాకుండా ఉండిపోయావా, "నగరాజధర!" అని ప్రశ్నించడంలో కవితా చమత్కృతి ఎంతైనా ఉంది. రాముడు సీదాసాదా దేవుడు—కాని కృష్ణుడు చతురుడు; కపట నాటక లీలాచతురుడు. కనుక కృష్ణుణ్ణి ఊహించుకున్న త్యాగరాజుకి ఆ లీలా నాటక సూత్రధారిని హెచ్చరించే మనస్థితి సహజంగా దొర్లుకుంటూ వచ్చి

ఉంటుంది. తన వాహనం కదలలేదన్న నెపంతో ఆదివారం నాడు తమరింటికి రాని ఆ ప్రస్నేహితుణ్ణి ఎత్తి పొడిచినట్లు పైకన్నా, యింకో మెట్టు పైకివెళ్లి ఆ వాహనం ఏ సైకిలో, మోటారుకారో కాక, చైతన్యం జవసత్వాలూ స్వామి కార్యనిర్వహణాసక్తి, అన్నీ యెంతగానో ఉన్న గరుత్మంతుడు కనుక, ఆ ఖగరాజు చెప్పిన సాకుని ఒప్పుకుని "రావడం మానేశావా, నీ సేవకుణ్ణి కూడా మందలించుకోలేని నిశ్శక్తత నీకు దాపురించిందా, ఆలాటి ఖగరాజుని విస్మరించి యింకోలా వచ్చిపడే ఆసక్తిలేని నిర్లక్ష్యం నీలో ఉందా" అని ఆ సర్వశక్తిమంతుణ్ణి హెచ్చరించడంలో భావోక్తి వైచిత్ర్యం బహుళోన్నత స్థాయినందుకున్నది.

అయితే అలా ఉపేక్షించిన ఆ భగవంతుడి ప్రవర్తనను గురించి యింకొకరితో మొఱపెట్టుకునే అవకాశం లేదు. అంతకన్న పై కోర్టులేని సర్వోన్నత కోర్టులో ప్రధాన న్యాయమూర్తి ఆ దేవదేవుడు అన్న సంగతి ఆయనకు జ్ఞాపకం చెయ్యాలి; అందుచేత "జగమేలే పరమాత్మ" (ఇక్కడ అభేరి రాగ స్వనాలు తారస్థాయికి చేరుతూ యీ సంబోధననీ, హెచ్చరికనీ నొక్కినొక్కి గట్టిగా చెప్తాయి!) "నువ్వు రాలేదని ఇంకెవరితో మొఱ పెట్టుకోను? "అన్న ధాటీ ప్రశ్నని, మళ్ళీ బోలెడు ఆశ్చర్యార్థకాలతో పాటు. వేశేస్తారు. అంతేకాదు. "వగ చూపకు, తాళను" అని ఆ దేవుణ్ణి చురుగ్గా కోప్పడతారు!

"వగ" అంటే విలాసం; క్రీడార్థం, అవతలవారిని మభ్యపెట్టే నటన. ఆటకత్తె, ఉంపుడుకత్తె వగలుపోతుంది కోరిక తీర్చకుండాను. తన్ను రక్షించడానికి, తన కోర్కె తీర్చడానికి "పది వేషములలో రామవేషము బాగని నిన్నెన్నుకొన్నాననీ", కావాలని ఆ దేవుణ్ణి తానెంచి ఉంచుకున్న త్యాగరాజస్వామి యీ 'వగ' అనే పదాన్ని చనవుతో కవితా ప్రతిభతో వాడారు. ఒకరు యింకొర్ని మభ్యపెట్టేందుకు "వగలు పోతారు", "వగలు చూపిస్తారు". అలాగే ఏదో చప్పని సాకు ఒప్పుకుని, చెప్పి, తన్ను రక్షించడానికి రాకుండా ఉండిపోయిన ఆ విష్ణుమూర్తినీ, అలాంటి ప్రవర్తనను తాను భరించలేనని, తట్టుకోలేనని, "చనవు" తనకిచ్చిన అధికారంతో కనుబొమ్మ ఎగరవేస్తూ, కనకన్నులో తామసం వెలిబుచ్చుతూ చెప్పారా అనిపిస్తుంది అభేరిరాగంలో

పల్కిన ఆ మాటలు పాడుకుంటే! శుద్ధసత్వం అలవర్చుకున్న సంగీతోపాసకులు కూడా తమకు జరిగిన అన్యాయం వల్ల నిస్సహాయ మనస్థితి కమ్ముకొస్తే, యీలా రాజసతామసాలు ప్రకటించి, ఆ వెంటనే విలపించడం మానవ సహజం అన్నారు, సంగీత శాస్త్ర నిష్ణాతులు, అందుకే తనకూ ఆ పరమాత్మకూ ఉన్న అనుబంధం యీలా వివరిస్తారు. ఆతడు జగమేలే పరమాత్ముడు. ''నను బ్రోవ మని చెప్పవే, సీతమ్మతల్లీ'' అన్న రామదాసు పాటలో సూచించిన ఉపాయాన్ని కాదనుకున్నారు– మొదట్లోనే ''ఒగి బోధనచేసే పరివారం'' కాదని అను కున్నాక. అంచేత ఇంకొకరి సిఫారసు కోసం ఆశించక, ఆ పరివారంలో వారితో మొఱ పెట్టుకునే ప్రసక్తే లేదు కనుక, ''ఎవరితో మొఱ లిడుదు'' అనేసి ''వగజూపకు, తాళను'' అని నొక్కి చెప్పి, "సన్నేలుకోరా'' అని ఆక్రోశిస్తారు త్యాగరాజస్వామి. ''రా" అనే ప్రయోగం కూడా ఆ భావావేశాన్నే బలపరుస్తుంది.

ఈలా నిస్తుల శరప్రయోగ సౌలభ్యంతో అభేరిరాగంలో ఆ వాగ్గేయ పరబ్రహ్మ గుప్పించిన భావపరంపరకి తట్టుకోలేక, ఆ పరమాత్ముడే ఉక్కిరి బిక్కిరి అయి ఉండాలి! మనస్సుతో (గాత్రంతో మాత్రమే కాక) పాడుకుంటూ, హృదయంతో వింటూ, హృదంతరాళాల్లో ఆ సంగీతోపజ్ఞ నింపుకుని అనుభవిస్తే యీ కృతిలో ఉండే సొగసులు బ్రహ్మానందాన్ని అందిస్తాయి. అభేరిరాగంలో ఆయన రచించిన ఏకైక కృతి యిది- చనువుగల ఎగతాళీ, ఆక్రందనా, ఏకోన్ముఖ మైన భక్తీ ముప్పేటగా మలచి, అభూతోపమైన విశిష్టతతో అంతటా ప్రకాశించే సర్వోత్కృష్టమైన మణిపూస యీ కృతిరత్నం!

# * "నారద గానలోల''

''నారద గానలోల'' అని మొదలుపెట్టే అఠాణరాగ కీర్తనలో ఆ భగవంతుడు ఉన్నాడన్న తన నమ్మకానికి ఋజువులు ఏకరువు పెడతారు, చరణంలో, త్యాగరాజస్వామి:

''నీవులేక యేతనువులు నిరతముగా నడచును?
నీవులేక యేతరువులు నిక్కముగా మొలుచును?
నీవులేక యేవానలు నిత్యముగా కురియును?
నీవులేక త్యాగరాజు నీగుణముల నెటుబాడును?''—

అని ఉద్ఘాటించారు.

ప్రకృతి సిద్ధమైన సంవిధానాలు నిరాటంకంగా జరిగిపోతూ, గడియారపు ముల్లుల్లా సాగిపోతూ ఉంటే, ఎవరో ఆ సంవిధానాలకీ, సాగిపోవటాలకీ యాజమాన్యంవహించి యంత్రాంగం నడిపిస్తున్నారన్న ఊహ, కామ, నమ్మకం, కుదుర్చుకుంటాం మనం. ఇక్కడ త్యాగరాజస్వామి, ప్రకృతి సిద్ధాలైన మూడు నిత్యవైచిత్ర్యాలని సూచించారు. శరీరాల్లో ప్రకృతి ధర్మంగా హృదయ స్పందన, రక్తప్రసారం మొదలైనవి **నిరతముగా** (ఆపకుండా), నిరంతరంగా సాగిపోవడం-యీ తనువులు (బ్రతుకులు) నడవడం ఏ మహాశక్తి వల్లా అనే ఆలోచన కలుగుతుంది. ఆలాగే విత్తులు నాటితే చెట్లు **నిక్కముగా** (సత్యంగా) మొలుస్తాయి. వేపగింజ పాతితే వేపచెట్టే మొలుస్తుంది; చింతగింజ పాతితే చింతచెట్టే మొలుస్తుంది! బీజానికి సత్యమైనరీతిలో నిక్కముగా చెట్లుమొలవడం ఏ మహాశక్తి వల్లా అనే ఆలోచన కలుగుతుంది. అదేవిధంగా వానలు **నిత్యంగా** కురుస్తాయి. నిత్యం అనే పదం సామాన్యంగా ప్రతిరోజూ, అనే భావనని కలిగిస్తుంది. అంతకన్న స్థూలంగా నిర్ణీత కాలాలు, కాలచక్ర భ్రమణంలో మళ్ళీ మళ్ళీ రావడాన్ని (వారాలు, మాసాలూ, ఋతువులూ) కూడా ''నిత్య'' పదం సూచిస్తుంది. ఇక్కడ నిత్యంగా కురవడం అంటే ప్రతీయేడూ కురవడం అన్నమాట. వానల కాలం వచ్చేసరికి ఋతుధర్మం తప్పకుండా వర్షాలు కురియడం ఏ మహాశక్తి

**మూలంగా** అనే ఆశ్చర్యం కలుగుతుంది. ఇవన్నీ యీలా **నడిపించే, మొలిపించే, కురిపించే** మహాశక్తి ఒకటి ఉందనుకోవాలి తప్పదు - ఆలాటిదేదో ఉండకపోతే ఇవి యింత, నిరతంగా, నిక్కంగా, నిత్యంగా ''జరగవు''. కనుక అలా తప్పని సరిగా ఉన్న మహాశక్తి, పరమాత్మ; త్యాగరాజస్వామి హృదంతరాన్ని ఆక్రమించుకున్న రాముడు. ఆతడంతటా ఉంటాడు; ''నువ్వు ఉన్నావు- నువ్వులేకపోతే- ఇవన్నీ యెల్లా, యీలా జరుగుతాయి'' అని ''బల్లగుద్ది'' అఠాణ రాగంలో అధికారయుత సుస్వనంలో పల్కుతారు త్యాగరాజస్వామి.

అంతేకాదు-తన మనస్సాక్షి అంతకన్నా దృఢతరమైనది స్వామివారికి-తనంతటి భక్తుడు నమ్మకంగా భగవంతుని గుణాలు (వర్ణిస్తూ) పాడుతున్నాడంటే, ఆ భగవంతుడున్నాడన్నమాటే! **ఆతడు** (నీవు) లేక **ఆతని** గుణ సంకీర్తన యెల్లా జరుగుతుంది; అందులోనూ త్యాగరాజు వంటి వాక్శుద్ధిగల వాగ్గేయకారునిచేత! త్యాగరాజస్వామి వారి ఆత్మవిశ్వాసం చరణాంతాన్ని మాత్మోగుతూంటే, ఆ వాక్కు సత్యం కానిది పల్కదన్న విశ్వాసం ఆయనకీ, మనకీ కూడా పరమసత్యం- ఆతారాక్కణాలు పరమసత్యాలు; పరమసత్యానికి తారాక్కణాలు' ఆ వాక్కు పరమసత్యం; పరమసత్యం పల్కించేది! ఆ త్యాగరాజ స్వామివారి సిద్ధాంతం అనాక్షేపణీయం!

## * "ప్రక్కల నిలబడి"

ఖరహరప్రియరాగం—త్రిపుటతాళం

పల్లవి : ప్రక్కల నిలబడి కొలిచే ముచ్చట బాగ దెల్ప రాద?

అనుపల్లవి : చుక్కలరాయని గేరు మోముగల
సుదతి సీతమ్మ, సౌమిత్రి, రాముని కిరు—ప్రక్కల॥

చరణం : తనువుచే వందన మొనరించుచున్నార ?
చనవున నామకీర్తన సేయుచున్నార ?
మనసున దలచి మైమరచి యున్నార ?
నెనరుంచి త్యాగరాజునితో, హరిహరి కిరు—ప్రక్కల॥

సీతమ్మ, లక్ష్మణస్వామి, కోదండరామునికి ఆ ప్రక్కా, యీ ప్రక్కా- రెండు ప్రక్కలా - నిలబడి వున్న అయోధ్య రాముని చిత్రపటం (రవివర్మ చిత్రణం) మనం అంతా చూసిందే! అలాటి చిత్రమే, యింకోటి, త్యాగరాజస్వామి వారు దర్శించినప్పుడు, ఆయనకు కలిగిన భక్తిభావ సంచలన వైభోగం ప్రస్ఫుటం అవుతుంది యీ కీర్తనలో:—మధ్యనున్న శ్రీరామచంద్రుని దివ్య మూర్తిని చూసి చూసి, తరువాత అటూ యిటూ ఇరు ప్రక్కలా నిలబడివున్న సీతమ్మనీ, లక్ష్మణుణ్ణీ, వారిద్దరూ నిలబడివున్న ఆ భంగిమలనీ పరకాయించి చూస్తే, వాళ్ళిద్దరూ యేం చేస్తున్నారూ అనే ప్రశ్న రేకెత్తుతుంది. నిత్యానందం కలుగకపోతే వారల్లా ఏకహృదయులై అల్లా ఆయన ప్రక్కన వాళ్ళు "చుట్టుకుని" ఉండరని త్యాగరాజస్వామి వారి నమ్మకం. ఆ సంగతి యింకో పాటలో నిర్ధారణగా వివరించిన ఆ మహాభక్తుడు, యీ పాటలో వాళ్ళిద్దరూ త్రికరణశుద్ధిగా త్రికరణాలతోటీ ఆ తమ రాముణ్ణి కొలుచుకుంటూ సేవించు కుంటూ వాళ్ళు నిలబడి ఉన్నారని, మనకోసం మళ్ళీ వివరించారు.

త్రికరణములు అంటే మనస్సు, వాక్కు, కాయకర్మ. ఉదహరించుకోడం యీ క్రమంలోనే అయినా, ప్రాముఖ్యతలో, ప్రయోజనంలో వాటి క్రమం

అటునించి ఇటు-కాయకర్మ (శరీరంతో యింద్రియాలతో చేసి సాధించే పనులు) వాక్కుతో సాధించే వాటికన్న తక్కువ స్థాయిలోనివి; వాక్కుతో సాధించే వాటికన్న పై మెట్టున ఉంటై మనస్సుతో, లో, చేసేపనులు-సాధించే ఫలాలు. అంచేత అదే క్రమాన్ని సూచిస్తారు, చరణంలో త్యాగరాజస్వామి—

1. తనువుచే వందన మొసరించుచున్నారా? అని మొదటి ప్రశ్న! లక్ష్మణస్వామి, ఛాతీ విరుచుకుని వీరోద్ధతితో కాక, వినయం ఉట్టిపడే సేవకాభావం వెల్లివిరియగా, తనువును రామునివైపుకి వంచి, సౌమ్యంతో కొంచెం వంగి వినమితుడై నిల్చున్న భంగిమ—మొహంఎత్తి, కళ్ళారా తన రాముణ్ణి చూసుకుంటే దృష్టి దోషం తగుల్తుందేమోననే శంక వెనక్కి లాగుతూ ఉంటే—కడకళ్ళతో కడచూపుల్తో (మొహం ఆయన కేసి త్రిప్పకుండానే) మురిసిపోతూ తన రాముణ్ణి చూసుకుంటూ, ఉత్తమ స్త్రీ సహజమైన సాత్త్వికభావం ప్రస్ఫుటంచేసే ఒయ్యారపు టొంపుతో నిల్చున్న సీతమ్మ భంగిమ-ఈ రెండు భంగిమల్ని చూసినప్పుడు, ఆ తనువులున్న భంగిమలతోనే వారిద్దరూ ఆ రాముడికి వందనం చేస్తున్నట్లుంది అనుకుని, వాళ్ళిద్దర్నీ ప్రశ్నే అడుగుతారు త్యాగరాజస్వామి.

2. రెండో ప్రశ్న—చనవుతో నామకీర్తన (వాక్కుతో) చేస్తున్నారా అనేది: ఒకరి దగ్గర యింకొకరు "చనవు" తీసుకున్నారంటే, వారికి అనురాగం ఉంటుంది, అది యిచ్చే అధికారం ఉంటుంది—మనస్సులో ఏదో కోరికా ఉంటుంది. కొంత సాధించగలం అనే ధైర్యమూ ఉంటుంది. అసలలా చనవుతో ప్రవర్తించడానికి "చెల్లుబడీ" ఉంటుంది. ఇన్నిరకాలైన యోగ్యతల్నిచ్చే చనవు వారికుంది. అయినా వారిద్దరూ కూడా నామకీర్తన చేస్తున్నారా, ఆ చనవుతోనే ఆయన్ని వర్ణిస్తున్నారా, పొగడుతున్నారా అని అడుగలేదు; సహస్రనామ తత్తుల్యమైన ఆ నామాన్ని ఊరికే ఉచ్చరించడమూ కాదు. చనవుతో కీర్తిస్తున్నారా? "కీర్తన"గా మనోధర్మంతో భక్తి పెల్లుబికే సంగీతం మిళాయించిన కీర్తన గా వాక్కుతో వెలువరిస్తున్నారా అని ప్రశ్నించారు. "తెలిసి" రామకీర్తన చేసేవిధానంలో ఉన్న "నామకీర్తన" అది. మూడో పాదంతో కూడా కలిపి అన్వయించుకుంటేను, త్రికరణములుపయోగించుకోవడంలో రెండో మెట్టున ఉన్నారా అనే ప్రశ్న యీ చరణం రెండో పాదంలో, వేశారు త్యాగరాజస్వామి.

3. ఇక మూడో పాదంలోని ప్రశ్న—మనసున తలచి మైమరచిఉన్నార? అని. మనస్సులో ఆ రాముణ్ణి తలుచుకుంటే, సీతమ్మకీ, సౌమిత్రికీ (''నిజ'' భక్తులకి) మైమరపు కలుగుతుంది. తలుచుకోడం అంటే, యథాలాభంగా కాదు; కావాలని ఆ కమలనయనుణ్ణి సాధించి మనస్సులో నిలబెట్టుకుని కట్టేసి ఉంచేసిన ''తలపు'' అది! మిగిలిన తలపులన్నీ నిలిపి (ఆపివేసి) ఆ రాముణ్ణి గురించిన తలపుని ఒక్కదాన్నే నిలుపుకునే (ఉంచివేసుకునే) లాగ తలుచుకోవడం అన్న మాట! ఏకాగ్రతతో, ఆ రాముణ్ణి తల్చుకుంటే బాహ్యస్మృతి లేకుండా శరీరస్థితి మీద దృష్టే లేకుండా ''మైమరపు'' కలుగుతుంది. అప్రయత్నంగానే, కన్నులు మూసుకుని, యింద్రియ సంచలనాలన్నీ ఆ మనస్సులోకే కేంద్రీకరించి ''తను'' అంతా ఆ మనస్సులోకే వెళ్ళి, ఆ రాముణ్ణి సేవించుకునే పరిస్థితి అది. త్రికరణాల్లో తేజోతమమైన సాధనం (Superlative tool) మనస్సు-మనుష్యుడన్న ప్రతివాడికీ ఉండే ప్రత్యేక సాధనం! ఆ సాధనం యొక్క గొప్పతనం, ఆ సాధనాన్ని సమంగా ఉపయోగించుకుంటే కలిగే ఫలం యొక్క ఉత్కృష్టతా తెలిసివచ్చేటట్టు, క్రమంలో మూడో పాదంలో చూపెట్టారు త్యాగరాజస్వామి. మూడో పాదంలో గొంతు నెంతగానో ఎత్తి తారాస్థాయికి స్వరాన్ని ఎత్తి పాడే శబ్ద వైభోగంతో ఆ ఉత్కృష్టతని సూచిస్తుంది ఖరహరప్రియరాగం!

ఇది తప్పక గమనించదగ్గది:- తను చెప్పిన అన్నిటిలోనూ ముఖ్యమైన విషయాన్ని, సాధారణంగా చరణంలోని మూడో పాదంలో చొప్పిస్తారు త్యాగరాజస్వామి— ఇది వారి ప్రత్యేకత; విశిష్ట కవితా వైభవం. చరణంలో సంగతులు పాడుకుంటూ, మూడో పాదం దగ్గిర కొచ్చేసరికి, రాగచ్ఛాయల్ని నిబిడీకృతం చేసుకుంటారు గాయకులు; స్వరం తారస్థాయికి చేరుకుంటుంది— ఎక్కువ సార్లు పాడేదీ, అన్ని సంగతులూ వివరించేదీ ఆ మూడవ పాదమే. ఈ పాటలో యీ మూడో పాదం—"నిధి చాలా సుఖమా''లో ''మమత బంధన యుత నరస్తుతి సుఖమా'' అనే మూడోపాదం - "ఎటులబ్రోతువో తెలియ''లో ''దుష్టులతో గూడి దుష్కృత్యములు సలిపి'' అన్న మూడో పాదం యీ సిద్ధాంతాన్ని స్పష్టీకరిస్తాయి.

ఇక వాడిన పదాల సొబగులు పరిశీలిస్తే— వాళ్ళిద్దరూ ఆ రాముడి కిరుప్రక్కలా అలా నిలబడి సేవించుకోవడాన్ని ''ముచ్చట'' అన్నారు. మనస్సుకి గిలిగింతలు పెట్టే వృత్తాంతాన్ని ''ముచ్చట'' అంటాం మనం! కమ్మని తెలుగు భాషలో కొల్లలుగా ఉండే సొంపైన పదాల్లో యీ "ముచ్చట'' ఒకటి! అలా చెరి ఒక ప్రక్కా నిలబడి ఆ తమ రాముణ్ణి అలా సేవించుకోవడం సీతాలక్ష్మణులిద్దరికీ ''ముచ్చట''! అలా ''ముచ్చట'' ని అనుభవించే ఆ వారిద్దర్నీ చూడ్డం త్యాగరాజ స్వామికీ (ఆయన పడ్తుంటే మనకీ) ముచ్చట! అది ఒక

ముచ్చటనుకోడమే కాక, ఆ ముచ్చట ననుభవించే ఆ సీతాలక్ష్మణు లిరువురూ ఆ ముచ్చటలోని ఆంతర్యాన్ని వాళ్లే వివరిస్తే తనకింకా ముచ్చట కలుగుతుందనీ, త్యాగరాజ స్వామి యీ పాట పాడారు! ఈ ముచ్చట అనే పదాన్ని ఇక్కడే కాదు, ఇంకా ఎన్నో పాటల్లో (ఉదాహరణకి'' ముమ్మూర్తులు గుమిగూడి పొగడే'' అన్నపాటలో) త్యాగరాజస్వామి బహుళ ప్రయోజనంతో వాడారు.

''చుక్కలరాయని గేరుమోము'' అనే అచ్చ తెనుగు పదాల కూర్పుతో ఆ సీతమ్మ ముఖ సౌందర్యాన్ని పొగిడారు! "చుక్క'' అంటేనే "చక్కనిచుక్క'' అనిపిస్తుంది- ఆలాటి చుక్కలే మక్కువపడే గొన్న రాయడు (రాజు) చంద్రుడు— ''ఆడది మెచ్చిందే అందం'' అన్నట్టు; అంత అందమైన చంద్రబింబాన్నే వెక్కిరించే, అపహసించే (గేరు) అందంగల మోము అమ్మవారిది—పల్లవిలో యిద్దరినీ సూచనాప్రాయంగా స్ఫురింపచేసి - వా రెవరో అను పల్లవిలో స్పష్టీక రించడంలో, ఆ యిద్దరిలోనూ అతిఘనతగల అమ్మవారిని వర్ణించకుండా ఉండ లేకపోయారు త్యాగరాజస్వామి. అమ్మవారి ముఖ సౌందర్యం అలా వర్ణించి, ''సౌమిత్రి'' అనే పదం ఒక్కటీ వాడినా, లక్ష్మణస్వామి సుమిత్రకొడుకు అనే బాహ్యార్థ సూచనతో పాటు సౌహార్ద్రితా, సౌమనస్యం, మైత్రీ అన్నీ శబ్ద సామీప్యంతో స్ఫురింపచేస్తూ సౌమిత్రిని శ్రోతల మనస్సులకి గోచరింప చేస్తుంది యీ అనుపల్లవి.

చరణం ఆఖరి పాదంలో ఆ, యీ ముచ్చట తనకి (త్యాగరాజుకి) ''నెనరుంచి" చెప్పమంటారు. ''నెనరు'' అంటే సామాన్యంగా ప్రేమ, అభిమానం. అంతగా అడుగుతూన్న తమ సాటిభక్తుడైన త్యాగరాజుమీద అభిమానం ఉంచ మన్న మాట ''నెనరుంచి'' అంటేను - నెనరుంటేనే, మనస్సులో ఉన్నమాట దాచక చెప్పబుద్ధి అవుతుంది. ''నెనరు'' అంటే కృతజ్ఞత కూడాను. త్యాగరాజ స్వామి మీద ఆ యిద్దరు రామ భక్తులకీ కృతజ్ఞత ఉండదగ్గదే! ఇంకెవ్వరు చేయని పని అది. ఆ చిత్రాన్ని చూసినప్పుడు, ఆ వాళ్ళిద్దరికీ అంత ప్రాముఖ్యం నిచ్చి, వాళ్ళెలా ఉన్నారో, ఏం చేస్తున్నారో ఆలా నిలబడిఉండటంలో అర్థం ఏమిటో, తెలుసుకుని, వాళ్ళెంత ఉత్తమ భక్తులో అని ఉగ్గడించే ప్రపత్తి త్యాగరాజస్వామిది. అందుచేతనే అంత చనవుగా అడిగే ఆయన యెడల వాళ్ళి ద్దరికీ ఆ కృతజ్ఞత అనురాగం గల 'నెనరు' ఉండదగ్గదే- ఆయనతో వారు చెప్పేది ''నెనరుంచి'' చెప్పదగ్గదే!

"హరి హరి'' అనే పదం ఉత్సవ సంప్రదాయ సిద్ధమైన ఆమ్రేడితం. ఇంత చిన్న పాటలో త్రికరణ శుద్ధంగా భక్తి సామ్రాజ్యాన్ని స్వీకరించుకునే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు త్యాగరా[illegible] ...పేతావైభవో పేతమైన రామభక్తి సామ్రాజ్యం !

## * ''ముమ్మూర్తులు''

అఠాణ రాగం : ఆదితాళం

పల్లవి : ముమ్మూర్తులు గుమిగూడి పొగడేది -
ముచ్చట విను కొనరే — ॥ముమ్మూర్తులు...

అనుపల్లవి : సమ్మతిగ రాజు కొడుకనగా విని
సంశయము దీరక — శ్రీరాముని ॥ముమ్మూర్తులు...

చరణం : రోసముతో — రఘురాముని గుణముల —
రూఢిగ దమ గుణముల నటు వ్రాసి,
త్రాసున నిడ సరి నిల్వగ లేదని
త్యాగరాజ నుతు డెవడోయనుచును, ॥ముమ్మూర్తులు...

చాలా తక్కువ పదాలు మాత్రమే వాడి, సూచనాప్రాయమైన కథనంలో, ఎంతో విపులమైన గాధనో, సన్నివేశాన్నో, ప్రతిభతో శ్రోతల మనో వీథులలో స్పష్టంగా ప్రత్యక్షం అయేటట్లు చేయగల కవితాశిల్ప సృష్టినైపుణ్యం త్యాగరాజ స్వామి వారికి కరతలామలకం. కొంచెంగా విదిపిన కుంచె విసురులతోనే దివ్య సుందర చిత్రాన్ని రచించిన చిత్రకారుడి మల్లేనూ, కొలదిపాటి ఉలి మలపులతోనే దివ్య సౌష్టవ శిల్పమూర్తిని చెక్కిదిద్దే శిల్పికి మల్లేనూ, త్యాగరాజుల వారు తమ కృతి రచనలో ప్రతిభ చూపిస్తారు. అప్రయత్నంగానే, అలాంటి ప్రతిభకి ఒక ఉదాహరణ, యీ అఠాణ రాగ కృతి !

ఈ కృతిలో త్యాగరాజస్వామి వారు తమ మనస్సు నందూహించుకొన్న ఒక విచిత్ర సంఘటనను, పల్లవి, అనుపల్లవి గాక ఒకే ఒక్క చరణం (అదీ చిన్నదే) ఉన్న చిన్న కృతిలోనే ఎంతో ప్రతిభతో వర్ణించారు. ఉచ్ఛరించిన ఒక్క పదంతో ఎన్నో భావతరంగాలని స్ఫురింప చేసే వాక్‌శిల్ప ప్రతిభ యీ కృతిలో బహుళంగా కన్పిస్తుంది.

ఈ కృతిలో పల్లవి, ఆ సూచించిన సంఘటనకి అంతాన్న ఉండే చిత్రాన్ని చిత్రీకరిస్తుంది. నిలిపి, నిలిపి; పలికి, పలికి మళ్ళీ మళ్ళీ పాడుకునేది పల్లవి, ఆ త్రిమూర్తులూ ఆ సంఘటన జరిగాక, అప్పుడు, ఆ విధంగా ''గుమి గూడి'' పొగడడమేకాకుండా, ఆ సంఘటనకి పర్యవసానంగా యిప్పటికీ—యీవేళకూడా అలా రాముణ్ణి పొగుడుతూనే ఉండి ఉంటారు ! మనకు తెలియవలసిన ముఖ్యా సారాంశం యిదీ ! త్యాగరాజులవారికి కన్పించిన ఆ సంఘటనకంత ప్రాముఖ్యం యిచ్చిన కీలకమైన విషయం కూడా అదే — ఆ ముమ్మూర్తులూ గుమిగూడి(తన) రాముణ్ణి పొగడడం ! అంచేత, ఆ ప్రయోజనం (మన మనస్సులమీద చెరగని ముద్ర పడాలని) ఆశించి, ఆ అంత్య విషయాన్ని ఆదిలోనే పల్లవిలో ఇముడ్చారు. ''అనగా అనగా ఒక కథ'' అని చెప్పే కథ గాదు ఇది. ''రాజకుమారుడు ఆ అందాల బాలని పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండి పోయాడు'' అన్న దాంతో మొదలెట్టిన కథ లాంటిది యీ కృతి !

అనుపల్లవిలో సంఘటనలోని కథ మొదటికి వస్తారు. సత్త్వ, రాజస, తామస గుణాలు ఒక్కొక్కరిలో ఒక్కొకటై యెంతగానో ప్రభావితాలైన ముమ్మూర్తులు సత్త్వ గుణ ప్రపూరితుడు విష్ణువు; రాజస గుణ ప్రపూరితుడు బ్రహ్మ; తామస గుణ ప్రపూరితుడు శివుడు, ఈ ముగ్గురికీ, భూలోకంలో ఒక రాజ కుమారుడుగా (దశరథ మహారాజు కొడుకుగా) ప్రజలందరూ ''సమ్మతిగ'' (by Consensus) తెలియబడే (అనుకొనబడే) శ్రీరామచంద్రుని త్యాగరాజ స్వామి వారు అంత గొప్పగా పొగడి పూజించి, ధ్యానిస్తూ ఉంటే, అసూయా, ఈర్ష్యా పుట్టుకొచ్చాయన్నమాట ! త్యాగరాజ స్వామివారు విచక్షణకల భక్తుడనీ, ఆయన భక్తి ప్రాపించడం దేముడికే అంతస్తు పెంచుతుందనీ అనుకున్నారేమో— తమకంటె గొప్పవాడా యేమిటి ఆ రాముడు ? ? అన్న భావ సంచలనం ప్రకోపించి, ఆలోచించుకున్నా, ఆ సంశయము తీరలేదుట— పోనీ అని ఆ త్యాగ రాజ స్వామివారినే అడిగేసి ఉంటారు. మా కంటే గొప్పవాడా ఆ రాముడూ ? అని రెట్టించి ఉంటారు. అపుడు మీకన్నా గొప్పవాడే అన్న సమాధానం వచ్చి ఉంటుంది. ఆ సంశయం తీరలేదు, తమ మనస్సులో ఉన్న ఆత్మ ధైర్యాల్ని (తమరే అందరికన్నా గొప్ప వాళ్ళన్నది) త్యాగరాజస్వామి బలపర్చక పోతేవారికి ''రోషం'' వచ్చింది !

సంశయము తీరకపోవడం అంటే సుస్పష్టం చేసే జ్ఞానం లేని అజ్ఞానం; మాయ ఉండడం. ఆ త్రిమూర్తులే ఆ అజ్ఞాన స్థితిలో, మాయలో ఉన్నారని త్యాగరాజస్వామి వారు సూచించడంలో అంతరార్థం వెదుక్కోవాలి. అంతవరకూ అనేక భక్తులు తమరిని, అతి ఘనంగా పొగడుతూ వుంటే అలవాటుగా వినే ఆ త్రిమూర్తులకీ, యీ సంశయం కలిగిందని చెప్పడంలో త్యాగరాజస్వామివారి ఉద్బోధ యేమిటి అని ప్రశ్నించుకుంటే, కొంత వివరించుకోవచ్చు. మానవులు మామూలుగా త్రిగుణాలూ (సత్త్వ, రాజస, తామసాలు) కలిసిపోతే అసంగతంగా అనేక విధాల ప్రవర్తిస్తూ ఉంటారు; ఆలోచనలూ నమ్మకాలూ తదనుగుణంగానే ఉంటాయి. "ఆ గుణాలు వదిలించుకోవడమే, సన్మార్గం'' అనే బోధ గురువు లందరూ చేసేదే గుణ ప్రకోపం తగ్గించుకుంటూ వస్తే మానవుడు పరమాత్మకు సన్నిహితుడౌతాడన్నది సిద్ధాంతం! చివరకు ఏ గుణమూ (సత్త్వగుణం కూడా) మిగలక, గుణాతీతుడైన మానవుడు, గుణాతీతుడైన పరబ్రహ్మ తత్త్వాన్ని తాదాత్మ్యంతో అవగతం చేసుకోగలడు అనేదీ సిద్ధాంతమే. రాజసం, తామసం తగ్గించుకుంటూ, అసలు లేకుండా చేసుకున్న సత్త్వ గుణ ప్రధానులు మహనీయ మూర్తులు! అలాగే ఏక గుణ ప్రధానులు ఆ త్రిమూర్తులు. అయినా యేదో ఒక గుణం అంత బహుళంగా ఉంది కనుక, ఆ త్రిమూర్తులకు కూడా ''రాముడెవరో'' తెలియదు. రాజు కొడుకన్నది ''విన్నారు'' — అంచేత సంశయము తీరక ఉన్నారు. కృతి అంతంలో కూడా వారు అట్లాగే ఉండి పోయారు, ఏక గుణ ప్రధానులు కనుక, త్యాగరాజు నుతుడెవడో, అనుకుంటూ ఉండిపోయారుట!

అలా అనుపల్లవిలో సంశయము తీరని త్రిమూర్తులకూ త్యాగరాజ స్వామి వారిని గురించి వాదోపవాదాలు జరిగాయేమో—ఏమైనా త్రిమూర్తులకి సంశయము తీరక, రోషం వచ్చి, ఆ సంగతి తేల్చుకుందామని నిశ్చయించుకొని ఆ రాముడికీ తమకూ ఉన్న అంతరం నిర్ణయించుకోవాలని త్యాగరాజస్వామి వారిని సిర్బంధించి ఉంటారు. అంచేత తమ "గుణాలనీ'' రాముడి ''గుణాలనీ'' (గుణ విశిష్టతలని) త్రాసులో పెట్టి, తైపారువేసి, మొగ్గు ఎటుందో తేల్చుకోవా లని తొందరపడ్డారు! ఆ రోషం, ఆ నిర్ణయం, ఆ తొందర, అజ్ఞానం అన్నీ ''రోసముతో'', ''త్రాసునపెడ'' అనే పదాల్లో ప్రతిభతో సూచించారు త్యాగ రాజులవారు. ఆ రోసంతోనే తమ గుణాలని తమరే ''వ్రాశారు''—''వ్రాసి''

అనే పదంతో, ఆ రాయడం, కాగితం మీదో, పత్రం మీదో ఏదో వ్రాయదగ్గ వస్తువుమీద వ్రాశారన్నమాట. రాముడెవరో ఎలాంటివాడో తెలియదువారికి, త్యాగరాజులవారికి తెలుసు. కనుక ఆయన ''రూఢిగ'' రాముని గుణాలు తాను వ్రాసి ఉండాలి. "రోసముతో'' వారివ్రాతకు చెందుతే "రూఢిగ" త్యాగరాజుల వారి వ్రాతకు చెందాలి. ''రఘురాముని గుణములు'' ''రోసముతో'' వెంటనే ఉన్నా, ''తమ గుణములు'' ''రూఢిగ'' ప్రక్కన ఉన్నా రోసముతో అన్నది రఘురాముని గుణములకు చెందదు. తమ గుణములకు ''రూఢిగ'' కొంత అన్వయించుకొన్నా, అది బహుధా త్యాగరాజస్వామి వారు నిబ్బరంతో ''తెలిసి రామచింతన చేసే'' మనస్సుతో, వ్రాయటానికే అన్వయిస్తుంది. ఈలా వ్రాసి ఉంచిన రెండు పత్రాలూ త్రాసులో, చెరి ఒక పళ్లెంలోనూ పెట్టగా (ఇడ), ''సరినిల్వలేదు'' అన్నారు; సమానంగా తూగలేదన్నమాట. ఆ త్రిమూర్తులు గుణప్రకోపంతో''అహంకారంతో''తమ గుణములను దూకుడుగా వ్రాసి ఉంటారు. త్యాగరాజస్వామివారు అనురాగంతో తమకు లభించిన సుజ్ఞానంతో (సరస్వతి రాగంలోపాడుకొన్నారు అనురాగము లేని మనసున సుజ్ఞానము రాదు అని) ఆర్ద్రిత నిండిన హృదయంలో బుద్ధిని ముంచి వ్రాసి ఉంటారు తన రాముడి ''గుణాలు'', పరమాత్మ స్వరూప వివరణలు ! ఏ ప్రక్కకి త్రాసు ముల్లు ఒరిగిందో వివరించి చెప్పరు త్యాగరాజస్వామివారు. కాని వెంటనే ఉన్న చరణంలో నాల్గో పాదంలో త్రిమూర్తుల ఆశ్చర్యవు, బెంబేలు పడే మానవస్థితిసి సూచిస్తారు. ''త్యాగరాజ నుతుడెవడో !'' అనే ఆశ్చర్యంతో తికమకలయ్యే స్థితి వారి కొచ్చిందంటే, రాముడి గుణాలతో తమ ముగ్గురి మొత్తం గుణాలూ సరితూగక, తమ పళ్లెం లేచి పై కెత్తుక పోయిందన్నమాట ! అది చూసిన త్రిమూర్తులకూ, రోసం పదలి పోయింది. ఇదివరకటి సంశయం, ''మా కన్న ఆ రాముడు గొప్పవాడా'' అనే సంశయం తీరింది కాని, దాని స్థానంలో యింకో సంశయం వచ్చింది. మనందరికంటే కూడా యింత(బరువైన) గొప్పవాడైనా యీరాముడు, త్యాగరాజు పొగడేరాముడు ( కేవలం రాజు కొడుకు మాత్రమే కాడన్నమాట !) ఎవరాతడు,అని తెల్లబోయినా తమలికంటె ఘనుడు కనుక తమరు కూడా పొగడదగ్గవాడన్నది మాత్రం తెలుసుకుని, ఆ త్రిమూర్తులూ గుమిగూడి పొగడడం మొదలెట్టారన్న మాట ! ఇదేకథ — అలా ఆ ముమ్మూర్తులూ గుమిగూడి ( రాముణ్ణి ) పొగడే

''ముచ్చట'' వినిపిస్తాను, మీరంతా వినండీ అని మనకి యీ కథ పాడి విని పించారు త్యాగరాజస్వామి వారు !

ఈ న్యూనాధికతల నిర్ణయానికి, జనసామాన్యానికి (పామరజనులకి) బాగా తెలిసిన, బజారులో సామానులు తూచడాని కుపయోగించే ''త్రాసు'' ను ప్రవేశపెట్టడం త్యాగరాజులవారి ప్రతిభకు తార్కాణం. ఇద్దరి న్యూనాధిక్యతలు నిర్ణయించడానికి సాధారణంగా పెద్ద మనుషుల నిర్ణయమేనా కోరవచ్చు లేక ''వోలింగు'' పెట్టొచ్చు. ఏ వ్యాసులవారి దగ్గరకో, బృహస్పతి దగ్గరకో వెడదా మనలేదు త్రిమూర్తులు. ఎవరినీ తమ కంటె గొప్పవాళ్లని ఒప్పుకోని గుణ ప్రకోపపుటహంకారం త్రిమూర్తులది! తమరే నిర్ణయించుకోవాలిఅజ్ఞానమాయాహం కారం కమ్మి, బజారు త్రాసుని యేరుకున్నారన్నమాట! త్యాగరాజులవారికి యే సాధనమైనా ఒకటే–రుక్మిణీదేవి తన భక్తిని నింపిన తులసీదళం ఒక్క దానితో ఎన్నో బారువుల బంగారం తూచలేని శ్రీకృష్ణుణ్ణి లఘువు చేసింది. అలాగే తనభక్తిని నింపిన గుణపత్రం అవతల యేదున్నా, లఘువు పరుస్తుందన్న నమ్మకం త్యాగరాజస్వామికి ఉండే ఉంటుంది. శ్రీకృష్ణతులాభారం కథ ఆయనకు జ్ఞాపకం వొచ్చి, త్రిమూర్తులు త్రాసులో తూచి నిర్ణయిద్దాం అంటే, చిరునవ్వుతో సరే అనిఉంటారు ! అయినా ఆ త్రాసుకి త్యాగరాజుల వారి భక్తి ప్రాభవంవల్ల, దేవతాగుణాలని తూచే శక్తి చేకూరి, పరమాత్మగుణాలకి (త్యాగరాజస్వామివారు వ్రాసిన వాటికి) బరువు కట్టే మాహాత్మ్యం అబ్బిందన్న మాట. దేవతలకైనా, మానవులకైనా బాహిరపు భౌతిక పరిమాణాలూ, విలువలూ కన్న, ఆంతర్యం లోని గుణాధిక్యతలే ముఖ్యమనే విషయాన్నీ, త్రిగుణాత్మకమైన దౌర్బల్యపు (అజ్ఞానపు) ప్రవర్తనను అధిగమించి గుణాతీతులౌతేనే, పరబ్రహ్మ జ్ఞానం లభిస్తుందనీ— యీ మహత్తర సందేశాన్ని, అందించారు సద్గురువులు, త్యాగ రాజస్వామి పరిమితమైన కొలది పదాల్లోనే, యీ కృతిలో !

ఇంత జరిగి అంత నిర్ధారణగా త్యాగరాజ స్వామివారి ఆధిక్యత నిరూ పింపబడగానే, సర్వదేవతలలోనూ ఉత్కృష్ట స్థానాలని ఆక్రమించిన దేవుళ్లు కనుక, మూతి ముడుచుకొని కూర్చొనకుండా, ఆ ముమ్మూర్తులు గుమిగూడి శ్రీరాముని పొగడడం మొదలు పెట్టారన్న మాట. ఆర్ద్రతా, అనురాగం నిండిన త్యాగరాజస్వామి హృదయానికి, వాళ్లు అహంకారం వదలుకొని, రాముణ్ణి

సేవిస్తూ పొగడుతూ ఉండడం ''ముచ్చట'' అనిపించింది! మహత్తర ప్రతిభాన్వితులూ, మహనీయులూ, దివ్యులూ, తన రాముణ్ణి యెక్కడ పొగడినా, కొలచి సేవించినా కూడా, అది త్యాగరాజుల వారికి ''ముచ్చటే''— అందుకనే ''ప్రక్కల నిలబడి'' అని మొదలయ్యే ఖరహర ప్రియరాగ కృతిలో—చుక్కల రాయని గేరుమోముగల సుదతి, సీతమ్మా సౌమిత్రీ శ్రీరామునికి యిరు ప్రక్కలా నిలబడి సేవించడంలో యేదో అతిలోకమైన ''ముచ్చట'' ఉందనీ, ఆ ''ముచ్చట'' యేదో తనకు తెలుపరాదా అని ముచ్చటగా, ముద్దుగా తానే అడుగుతారు! అయితే యీ అఠాణ రాగకృతిలో ఆ ముమ్మూర్తులు అలా గుమిగూడి పొగడే ముచ్చట (సంగతి) లోని ముచ్చట (ముదావహమైన విషయం) ఏదో మనకందరికీ తానై వివరించారు—కాదు, సూచించారు, త్యాగరాజ స్వామివారు!

అంత విపులమైన విషయ సంఘటనా కథా విశేషాన్ని అంత చిన్నకృతిలో యిముడ్చి ప్రసాదించడం తాగ్యరాజుల వారి భక్తి కవితా వైభవం. అది వారి ప్రతిభకు ఒక వైపు మాత్రమే; ఆ కృతిని అఠాణా రాగంలో పలికించడం ఆయన ప్రతిభకి రెండో వైపు! అఠాణా రాగం రక్తి రాగాలలో ప్రథమశ్రేణికి చెందిన దన్నది లోకవిదితం. శ్రోతలు సులభంగా గుర్తించడానికి వీలు ఎంతైనా ఉన్నా స్వరాల పోకడలో బుద్ధికి అందనట్టి ఛళుకులు రాగ స్వరూపంలో నిండిపోయిన విచిత్ర రాగమని సంగీతజ్ఞుల అభిప్రాయం* అంత విచిత్రమైన రాగం

---

* అఠాణ రాగంలోని సంచారములు కొన్ని ఆరోహ, అవరోహక్రమములను అతిక్రమించి విచ్చలవిడిగా ఉంటయ్యనీ— దానిలోని గాంధారము అటు అంతరగాంధారమూ, యిటు సాధారణ గాంధారమూ కాక, అతి చలితంగా ఉంటుందనీ, — దానిలోని నిషాదము ఇటు కాకలీ నిషాదమూ కాక అటు కైశికీ నిషాదము కాక ఊగిసలాడుతుందనీ, దానిలోని ధైవతం అప్పుడప్పుడు నిషాదానికి జారిపడిందా అనిపిస్తుందనీ — సంగీత కళానిధి టి. వి. సుబ్బారావుగారు చెప్పారు. అంతేగాక, ఆ రాగం అటు ఉధృతం, యిటు లాలిత్యం, అటు స్థూలత్వం. యిటు సునిశితత్వం, అటు ఉద్రేకభావోద్దీపనా, యిటు శాంతి ప్రసాద సౌభాగ్యం, యిన్నిటినీ ప్రకటిస్తూ పరస్పర వైరుధ్యాలని కలబోసికొంటుందని శ్రోతలకు సులభంగానే వినిచి తెలుపుతుంది.

వీర రసాన్నీ, అద్భుత రసాన్నీ ఒప్పిస్తుంది. అందుచేత అద్భుతమైన ఒక సంఘటనని సూచించడానికి త్యాగరాజ స్వామి వారికి అఠాణా ఉపయోగంలోకి వచ్చింది. అంతేకాక త్యాగరాజుల వారందించే ఉపదేశానికీ, అఠాణా రాగానికీ పొందికా, సామ్యం చాలా ఉన్నాయి. విషయం రాజు కొడుకైన రాముణ్ణి, పర బ్రహ్మగా గుర్తించుకోవాలి – త్రిమూర్తులకే సంశయం కలిగింది. రాముణ్ణి సమ్మతిగ అందరూ, దశరథ మహారాజు కొడుకంటున్నారు. మనకింకా తెలుసు- భార్య కోసం విలపించిన మానవ రూపుడన్నారు రామాయణంలో. అటువంటి వాడిని పరమాత్మ అని గుర్తించుకున్నారు త్యాగరాజస్వామి. యీ వైరుధ్య విష యాన్ని వర్ణించడానికి, త్రిమూర్తుల సంశయం, మథనపడి పోవడం, చివరకు చిన్న పిల్లల్లా చప్పట్లు కొడుతూ రాముణ్ణి పొగడ్డం లాంటి విషయాలు వివరించ డానికి సర్వ సంచారంలో నిలకడలేని అసంగత రాగం అయిన అఠాణా ఎత్తు కొన్నారని గుర్తిస్తే త్యాగరాజస్వామి సంగీత ప్రతిభ ఎంత మహత్తరమో ఊహించవచ్చు. రాగభావ సమన్వయం ఆయన సాధన—అనేక కృతుల్లో కన్పి స్తుంది యీ సాధనాప్రతిభ. తెల్లని మార్బుల్ రాయిలో చెక్కిన శ్రీకృష్ణుని మూర్తి పూర్తిగా నప్పదు— శ్రీకృష్ణుడు నీలమేఘ శ్యాముడు కనుక. ఆ తెల్ల మార్బుల్‌లో చెక్కిన శివమూర్తి రసాభాస కల్గించదు; పార్వతీపతి తెల్పు అని పెద్ద బాలశిక్షలోనే చదువుకుంటాం కనుక! అలానే అసంగతం కాని పరమాత్మ తత్త్వాన్ని సూచించడానికి అఠాణా రాగం బహు ప్రయోజనకారి అవుతుంది. మన సుకి చిక్కని మూర్తికీ, గొంతుకు చిక్కని రాగానికీ ఏదో సానుబంధం ఉంటుంది! అదా యిదా అని తేల్చుకొని ఊగిసలాట కులకడానికి అఠాణ ఎంతైనా ఒప్పుతుంది. ''నారదగానలోల'', ''అనుపమ గుణాంబుధి'' ''అట్ట బలుకుదు లిట్ట బలుకుదు'' ''ఇలలో ప్రణతార్తిహరుడనుచు'' ''ఏ పాపము చేసితిరా'' అన్న కృతు లన్నిటిలో పరస్పరాసంగతాలైన విషయాలే వర్ణింపబడ్డవే- అన్నీ అఠాణా రాగంలోనే పలికారు త్యాగరాజ స్వామి వారు

# * "కారు; వేల్పులు"

కల్యాణి రాగం: ఆదితాళం

పల్లవి॥ కారు; వేల్పులు నీకు సరి కారు;

అనుపల్లవి॥ కారుకు, జిలకరసంబా—కాంతరమైనట్టు గాని, ॥కారు...

చరణములు॥ 1. దివటికి దీపమురీతి,
కావేటికి కాలవలరీతి, గాని ॥కారు...

2. తమ్మవైరికి దామరలరీతి,
కమ్మవిల్తునికి కాంతినరులరీతి, గాని ॥కారు...

3. సాగరమునకు సరస్సురీతి
త్యాగరాజ వినుత! ధరలో నీకు సరి ॥కారు...

పల్లవిలో ఒక ప్రతిపాదన చేసారు, త్యాగరాజ స్వామివారు: రాముడితో అంటున్నారు. ''వేల్పులు (దేవతలు, యితర దేవతా స్వరూపాలేవీ), నీకు సరి కారు'' అని. మిగిలిన దేవతా స్వరూపాలన్నిటినీ తరచి చూసిన తర్వాతనే యీ సిద్ధాంతాన్ని స్పష్టీకరించుకున్నారు. "ఇతర దైవములవల్ల (ను) ఇలను సౌఖ్యమా; రామ'' అని ఛాయా తరంగిణి రాగంలో ఇంకొక కృతిలో యీ సిద్ధాంతాన్ని సుస్పష్టం చేసుకున్నారు. అయితే ఆ దైవం (శ్రీరాముని) వల్ల వచ్చే సౌఖ్యం ఏదో అక్కడ వివరించారు— ''మనసు దెలిసి బ్రోచే దైవం'' ఆ రాముడే అన్న నమ్మకంతో ఇతర దైవములవల్ల ఆ సౌఖ్యం ఉండదని తెలుసుకుని, అదికాక మిగిలినవన్నీ సౌఖ్యాలు కావని, ఆ దైవములవల్ల "సౌఖ్యమే'' దొరకదన్నారు. అదే నమ్మకంతో, ఆ భావనా ప్రోద్బలంతోటే తన రాముడికీ, ఇతర వేల్పులకీ ఉండే అంతరం అనేక ఉపమానాలతో స్పష్టీకరించుకొన్నారు; ఆ సిద్ధాంతాన్ని బలపరచుకొన్నారు యీ కృతిలో.

అనుపల్లవిలో కారుకు జిలకరసంబా (కు+అ) కాంతరమైనట్టు గాని అన్నది, వెంటనే అర్థం కాదు. త్యాగరాజులవారుండిన తంజావూరు జిల్లాలో

దొరికే బియ్యపురకాల్లో "కారు" బియ్యం అని ఒక రకం "జీలకరసంబా" అనే బియ్యపురకం యింకొకటి ఉన్నాయట. "కారు"లు చాలా ముతుక బియ్యం. "జిలకర సంబా"లు సన్నబియ్యం: శ్రేష్ఠాలు. (ఆంధ్ర దేశంలో కూడా ఉత్తర జిల్లాలో "జీలకర్ర సన్నాలు" అనే బియ్యం దొరుకుతాయి). ఆ కారు, ముతుక బియ్యానికీ, శ్రేష్ఠాలైన జిలకర సంబాలకూ ఎంత అంతరం ఉంటుందో, మిగిలిన వేల్పులకీ. శ్రీరామచంద్రునికీ అంత అంతరం ఉంటుందని స్పష్టం చేస్తున్నారు అనుపల్లవిలో. అయితే అంతర్యాలు తెలిపే ఉపమానాలెన్నో ఉండగా (తానే, చరణాల్లో అయిదింటిని, ఇతరోపమానాల్ని వాడుకున్నారు), అందులో చాలా కవిసమయాలై వాడుకలో చెలామణీ అవుతూండగా, యీ అరుదైన బియ్యపు సామ్యం అనుపల్లవిలో ఎందుకు ఎత్తుకున్నారని ప్రశ్నించుకుంటే, త్యాగరాజ స్వామి వారి కవిహృదయం అవగతం కావొచ్చు. అనుపల్లవి, పేరుకు తగ్గట్టే, పల్లవిలోని ప్రతిపాదనను, ఘాటుగా వివరించి, నీటుగా స్పష్టీకరించాలి. యూక్లిడ్ (Euclid)రేఖాగణిత సిద్ధాంతాల్లో ప్రతిపాదన (General enunciation) వివరణ (Particular enunciation or elucidation) ఉన్నట్లే, పల్లవి, అనుపల్లవి స్వామివారి కృతుల్లో విరాజిల్లుతాయి. చరణ విస్ఫురణలో ఆ ప్రతిపాదన యింకా స్థిరీకరింపబడి, కృతి అంతంలో సందేహానికే ఆస్కారం లేని నమ్మకని సంపాదించుకుంటుంది ఆ ప్రతిపాదన. ఇదీ త్యాగరాజులవారి ప్రతిపాదనా ప్రతిభ. వారి కృతులన్నీ యూక్లిడ్ థీరమ్‌లే అన్నారు కర్ణాటక సంగీతజ్ఞులు సంగీత కళానిధి టి. వి. సుబ్బారావుగారు!

బియ్యం అన్నం వండుకునే ముడిపదార్థం. "అన్నం" ప్రాణాలు నిలబెట్టి, దేహానికి పుష్టినిచ్చి, మనస్సుకి తుష్టినిచ్చే సాధనం. పరమాత్మ (ఇష్టదైవతం) స్వరూపం, భక్తిని పెంచుకుని, మనస్సుని కట్టుకుని, ఆత్మని ఉద్ధరించుకునేటందుకు సాధనం. ఒంటబట్టే అన్నం ప్రాణానిల సంయోగంతో జీవుడికోసం శరీరాన్ని నిలబెట్టినట్లే, మనసుపట్టే దేవుడు ప్రాణానిల సంయోగంతో ఆత్మ తన్ను తానుద్ధరించుకొనేందుకు సహాయపడతాడు. కనుక త్యాగరాజులవారు బియ్యపు సామ్యాన్ని దేవుడికి యేరుకున్నారనిపిస్తుంది. అన్నిదేవుళ్లూ ఆ పరమాత్మకు ప్రతీకలే అయినా, అన్ని బియ్యాలూ వంటికి సరిపోనట్లే, రుచివైచిత్ర్యాలతో ఇష్టదైవాలుపయోగిస్తాయన్న సిద్ధాంతాన్ని ఉదహరించుకుని, కడుపు

నొప్పి కలిగించే ముతకబియ్యానికి లేహ్యంలా పనిచేసే సన్నబియ్యానికీ తేడాని ఉదహరించి చమత్కరించారు త్యాగరాజస్వామివారు!

ఆ తరువాత మూడు చరణాల్లో ఐదు సామ్యాలు ఉదహరించారు. యీ అంతరాన్ని యింకా సుస్పష్టం చెయ్యడానికి:-

1. "దివటికి; దీపానికి రీతి" ఉదహరించుకునే క్రమంలో మొదటిది రామునికి సామ్యం: రెండవది వేల్పులకి చెందుతుంది. దీపం అంటే ఆ రోజుల్లో ప్రమిదెలో వొత్తివేసి, నూనెపోసి వెలిగించే దీపము – సామాన్య గృహాల్లో! కిరసనాయిలు దీపాలూ, పెట్రొమాక్సు దీపాలూ, ఎలక్ట్రిక్ దీపాలూ లేని రోజులవి. అలాంటి ప్రమిదెల్లో దీపాలు మినుకు మినుకు మంటూ అసంతృప్తిగానే వెలుగుతూ ఉండేవి. ఏదేవుడికి ఊరేగింపు జరుగుతూంటేనో ఏ జమిందారో పల్లకీలో ప్రయాణాలు చేస్తూంటేనో దివిటీలు వెలిగించేవారు. స్థయేకర్రకో, కడ్డీకో, ఒత్తుగా నూనెలో ముంచిన గుడ్డలు చుట్టి, అంతా ఒక్కసారిగా వెలిగిస్తే, ఉవ్వెత్తుగా మంటలు లేచి గొప్ప వెలుగునిచ్చేవి దివిటీలు; మినుకు మినుకుమంటూ ఎప్పుడారి పోతుందో అనే భయంలేకుండా, ఆరుబైటైనా, నిలిచివెలిగేవి దివిటీలు. ఈయా అంతరాన్ని గుర్తుచేశారు త్యాగరాజుస్వామివారు. రాముడు ఆరీతి అన్నారు, వేల్పులు యీరీతి అన్నారు!

2. "కావేటికి, కాలవల రీతి:" త్యాగరాజస్వామివారి పూరిదగ్గర వైభవంతో పారే నదీమతల్లి కావేరి. పవిత్ర జలాలు వెల్లివిరిసి శ్రీరంగంలాంటి పుణ్యక్షేత్రాలనిచుట్టి ప్రవహించే పావన వైభోగం ఆ నదీమతల్లిది. అక్కడా అక్కడా, సామాన్య ప్రయోజనాల కోసంతీస్తే, సన్నసన్నగా ప్రవహించేవి కాలవలు–యే మురికి జలాలు దొర్లినా అవి కాలవలే అవుతై. మంచిజలాలున్నా వాటికి మాతృక అయిన కావేటి గోటికి కూడా పోల్పదగనివే అవుతై పిల్లకాల్వలు, "పంటకాల్వలు" అని వ్యవహరింపబడే "కాలువలు". రాముడు కావేరి అయితే మిగిలిన వేల్పులు కాలవలు అన్నారు త్యాగరాజస్వామివారు!

3. ''తమ్మి వైరికి, తామరల రీతి'' : తమ్మి వైరి చంద్రుడు : తామరలు పువ్వులు ప్రభాసించే చంద్రుడు గుండ్రంగా వుండి వెలుగులు చిమ్ముతాడు. తామర పువ్వుకూడా గుండ్రంగా వున్నా ప్రకాశమానం కాదు. ఉత్కృష్టోపమకు ఆలవాలమైనవాడు చంద్రుడు : తన రాముడే రామచంద్రుడైనాడు, కనుక చంద్రుడితో పోలిక ఆ రాముడికి చక్కగా నప్పింది. తామర పువ్వులు, పువ్వులలో పెద్దగా అందంగా ఉన్నా ఆకాశంలో వెలిగిపోయే ఆ ప్రకృతి ''పుష్పా''నికి సమీపాలు కానేరవు.

4. ''కమ్మ విల్తునికి, కాంతి నరుల రీతి'' : కమ్మ విల్తుడు మన్మధుడు. పురుష సౌందర్యానికి పరాకాష్ఠ. కాంతి నరులంటే విలాస పురుషులు. సౌందర్య పోషణకి తంటాలుపడి, దుస్తులతోటీ, ముస్తాబుతోటీ, అసహజమైన కాంతితో తిరుగులాడే నరులకీ, ఆ మన్మధుడికీ అంతరం చాలా ఉంటుంది. మన్మధ సామ్యం మునులనే మోహింప చేసిన అలౌకిక సౌందర్యమూర్తి రాముడికి ఒప్పింది; కాంతి నరులనే సమాసం అసహజ సౌందర్యాన్ని ఎఱువుగా తగిలించుకొన్న విలాస పురుషులని స్ఫురింప చేస్తూ, ఇతర దైవాలకి తగింది.

5. ''సాగరమునకు, సరస్సు రీతి'' : సాగరం, సముద్రం : అంతులేని, దరిలేని జలాశయం. ''అంతు దరి లేదంటే, అమృతముందంటే, దేముడంతుంటాడో యేమొయనుకొన్నాను'' అని ఎంకి చేత ఒక కవి సమయాన్ని సృష్టింపించారు నండూరి సుబ్బారావుగారు. అంచేత సాగరం పరమాత్మను సూచించడానికి ఎంతైనా ఒప్పింది. ''సరస్సు'' లు కంటికి కనిపిస్తూ ఉండే అంచులతో, నిలిచి ఉన్న నీళ్ళతో సంకుచితాలుగానే ఉన్నవని స్ఫురిస్తాయి. తన రాముడు సముద్ర గంభీరుడు; సాగర సముడు. మిగిలిన వేల్పులు ''సరస్సులు'', చెఱువులు, నీళ్ళ గుంటలు త్యాగరాజ స్వామికి !

కల్యాణి రాగపు ఎత్తుగడలలో "కారు, సరికారు" అనే దృఢ భావన ఎంత దృఢంగా వినిపిస్తుందో మనస్సులో వింటూ, పైకి అనుకుంటూ యీ పాట చదువుకోవాలి; పాడుకోవాలి, చిన్నగానో, పెద్దగానో గొంతెత్తి ! అప్పుడు స్వామివారి భక్తి, కవితా ప్రాభవం సుస్పష్టం అవుతుంది ! !

* * *

## *"పాహిరమారమణా"

వరాళిరాగం – ఆదితాళం

పల్లవి : పాహి రమారమణ మాంపాహి సద్గుణగణ, హరేరామ ॥పాహి...

చరణములు: 1. చింతమాన, నీదుకరుణఇసు-మంతరాదు హరేరామ ॥పాహి...

2. ఎంతని సైరింతునే-నేమనివేగింతు, హరేరామ ॥పాహి...

3. చేతిమల్లెపూవు గుం-డ్రాతికోర్వబోదు, హరేరామ ॥పాహి...

4. దోసపండుకెట్టురామ-తోచునినుపకట్టు, హరేరామ ॥పాహి...

5. అహహ, చిలుకకుబ్ర-హ్మాస్త్రమునకుతగున,హరేరామ ॥పాహి...

6. తల్లి, తండ్రిబ్రోవకుంటే-తనయునకేదోవ హరేరామ ॥పాహి...

7. దేవదేవ వెన్న, కత్తి-దెబ్బకోర్చుకొనున, హరేరామ ॥పాహి...

8. రాజపర్యశరణ, త్యాగ-రాజవినుతచరణ హరేరామ ॥పాహి...

ఈ కృతి దివ్యనామ సంకీర్తనములలోనిది. శ్రీరాముని శరణాగతి పొంది మొరబెట్టుకునే కీర్తన. తనస్థితి, తన మనస్సులోని బాధ ఉపమానాల సహాయ్యంతో వివరించుకునే ప్రయత్నం. హరేరామ అని ప్రతిచరణం చివరా పాడుకోడం, తన నిస్సహాయతని ఎలుగెత్తిచాటి పాహి అని పల్లవి నెత్తుకోడానికి ఊపుగా చేయూత నిస్తుంది. రాముడు రమారమణుడు, బ్రోచి రక్షించే విష్ణువు, సద్గుణగణములు గలవాడని గుర్తుచేస్తారు. పాహి, మాంపాహి అని రెండుసార్లనడంలో మనస్సూ హృదయం సాగిలపడి సాష్టాంగపడ్డం సూచిస్తుంది.

తాను రాముని చింత, తెలిసి రామచింతన చెయ్యడం మానరు ; అయినా రామునికి కరుణ ఇసుమంతైనా, కొంచెమైనా రాదు. హరేరామ! అంటారు. ఎప్పటికేనా వాస్తుందన్న ఆశ యిదివరకుండేదేమో ఇప్పుడు ఎంతకని ఆ ఉపేక్షని సైరించి, ఓర్పుతో ఒప్పుకుంటానని వాపోతారు. ఏమనివేగింతు అంటే ఏదో సాకూ, సమాధానం చెప్పుకుని కష్టకాలం గడుపుకోవచ్చు. కాని యింత

ఉపేక్ష ఇన్నాళ్లు సద్గుణగణ్యుడైన ఆ రాముడే చేస్తున్నప్పుడు ఏమని సమాధానం చెప్పుకుని కాలం వేగించనూ అని ఆక్రోశిస్తున్నారు !

ఇంకో ఐదు చరణాల్లో ఆ రాముని నిర్దయలోని కాఠిన్యం, ఔదాసీన్యం తన సున్నితమైన మనస్సు మీద ఎంత ప్రభావం చూపిస్తున్నాయో, సముచిత మైన ఉపమానాల ద్వారా నిరూపిస్తున్నారు :—

i) తన మనస్సు మల్లెపూవు అంత సున్నితమైనది. ''చేతి మల్లెపూవు'' అనడంలో త్యాగరాజులవారు కొంచెం కుంచెవిదుపుల్తో మేటి చిత్రాలు చిత్రించే తన పద చిత్రణానైపుణ్యానికి నమూనా చూపించారు. విలాస పురుషులు మణి కట్టుకి మల్లెచెండు కట్టుకుంటారు. చెయ్యెత్తి ఆ సౌరభాన్ని మాటిమాటికీ ఆఘ్రా ణిస్తూ ఉంటారు. అటువంటి పురుషునిపై ఒకదుష్టుడు గుండ్రాతిని విసిరివేస్తే, అది ముఖానికో, గుండెలకో తగుల్తుందని, ఆ మణికట్టునీ చేతినీ అడ్డుపెట్టు కుంటాడు అప్రయత్నంగా. కాని అతిసున్నితమైన ఆ ''చేతి మల్లెపూవు'' ఆ గుండ్రాతి దెబ్బకు ఓర్చి చేతినైనా సంరక్షించ గలదా ! తనకున్న మనస్సు ఆ చేతి మల్లెపూవు లాంటిదట ! ఆ రాముని నిర్దాక్షిణ్యము గుండ్రాతి దెబ్బవంటిది. ఇంక వివరణ అనవసరం !

ii) తన మనస్సు దోసపండు : పండు అనడంలో ముగ్గి పోయిందనడం సూచన. అయితే యీ దోసపండు భక్తితో ముగ్గింది. దానికి మృదులత్వం, సత్త్వపేశలత్వం వస్తాయి దోసకాయకు లేనివి. అటువంటి దానికి ఒక ఇనుపకట్టు కడితే ఆ దోసకాయకు ఎలా తోస్తుంది అని ప్రశ్నించారు. ఇందులో ఒక మహ దర్థం స్ఫురిస్తుంది. అన్ని మెత్తని పళ్లుండగా దోసపండునే ఎందుకు ఉదాహరిం చారు త్యాగరాజ స్వామివారు అంటే - ఒకలా చెప్పుకోవచ్చు. ముగ్గిన దోస పండు దోసతీగెను వీడి అతి సులభంగా పడిపోతుంది ఈలా తీగెకున్న బంధా న్నుంచి విడివడే సౌలభ్యం దోసపండుకి అన్ని పండ్లకన్నా ఎక్కువట ! అందుకే వేదంలో రుద్రాధ్యాయంలో మృత్యుంజయ మహామంత్రంలో, ''ఉర్వారుక మివ బన్ధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్'' అన్నారు. ఉర్వారుకం అంటే దోస పండు. మోక్షప్రాప్తి కోసం తలమునించి భక్తిని సాధించుకున్న త్యాగరాజస్వామి మనస్సు ఒక్క ఆ దోసపండు - దానంతట అది మామూలుగా తీగెనుంచి (యీ దేహంనుంచి) విడివడి మోక్షం పొందగలదు. కాని రాముని నిర్దాక్షిణ్యం ఆ

మోక్షం కలుగకుండా ఆ తీగెకూ, పండుకూ ఒక ఇనుపకట్టు వేస్తోందన్న మాట. ఇంకో ఇం-కోరకపు కట్టుకాదు. ఇనుపకట్టు !

iii) ఆశ్చర్యార్థకంతో మొదలెట్టిన మూడో చరణంలో, తన మనస్సుని ఆత్మని చిలుకతో పోల్చుకున్నారు. ఆ రాముని నిర్దయని బ్రహ్మాస్త్రం అన్నారు. రాముడు చిలుకమీద బ్రహ్మాస్త్రం వేశాడన్న మాట! మామూలుగా పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం అంటారు. కాని యిక్కడ చిలుక అనడంలో, పలుకనేర్చిన పిట్ట మనస్సుకి తట్టుతుంది. పాటలు పాడే త్యాగరాజులవారు చిలుకౌతారు కాని పిచ్చుక కారు. "చిలుక'' పలుకనేర్వడమేకాక హంసలాగ ప్రాణానికి పర్యాయం; ఆత్మకి పర్యాయం. దేహంలో చిలుక ఎగిరిపోయింది అంటారు, ఆత్మకు దేహవిముక్తి కలిగినప్పుడు !

iv) తల్లి తండ్రి బ్రోవని తనయుడు అసహాయుడు దీనుడు అయిపోతాడు. అన్యాపదేశంగా తనకూ రాముడికీ ఉన్న అనుబంధం గుర్తుచేస్తారు. సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకు తండ్రి అని వసంతార్వరాగంలో అనురాగంతో పాడుకొన్న స్వామివారికి ఆ తల్లి తండ్రి రక్షించని తనయునిలా అయిన తనకింకే త్రోవలేదని వాపోతారు !

v) దేవదేవ అనే ఆమ్రేడితంలో అర్థంలో భగవంతుడి ఔన్నత్యం(దేవులకే దేవుడు) సూచింపబడ్డమే కాక, శబ్దంలో "రామరామ'' అన్నట్లు శోచనీయ స్థితి సూచకత్వం కూడా ఉంది ! తన మనస్సు వెన్న అయితే రాముడి నిర్దయ కత్తి దెబ్బ. వెన్నముద్ద కత్తిదెబ్బ కోర్చుకుంటుందా అన్నారు ! రామభక్తితో నిండిన మనస్సు వెన్నముద్ద ! క్షతత్రాతగా ఉండేది రాముడి కత్తి, కాని యిక్కడ అతని ఉపేక్షయే ఇంకోరకపు కత్తి, దానిదెబ్బ వెన్నముద్ద మీదనా !

vi) రాజవర్యశరణ అనడంలో రాముని ప్రపత్తి అంతటిది – రాజవర్యులకే శరణ్యమైన వాడు. త్యాగరాజ వినుత చరణ అనడం తానాతని కాళ్ల పట్టుకుని పొగడుకుని వేడుకునే భక్తుడసని. తమరిద్దరి మధ్యా యీ అంతరం నిరూపించుకుని తానాతని మీద ఆధారపడ్డం, తన భక్తి ఎంత గొప్పదో తానెంత అల్పుడో చెప్పుకోడం అన్నీ సాధించుకున్నారు.

* * *

# *"చల్లరె, రామచంద్రునిపై పూల"

అహిరి రాగం : చాపుతాళం

| | | |
|---|---|---|
| పల్లవి : | చల్లరె రామచంద్రునిపై పూల, | ॥చల్లరె... |
| 1. | ఇంపైన మనసుతో సొంపైన బంగారు | |
| | గంపలతో మంచి చంపకములను | ॥చల్లరె... |
| 2. | ఈ జగతిని దేవ పూజార్హమే పూల | |
| | రాజిలో మేలైన జాజి సుమములను | ॥చల్లరె... |
| 3. | ధాత వినుతుడైన సీతాపతి పైని | |
| | చేతులతో పారి జాత సుమములను | ॥చల్లరె... |
| 4. | పామరములు మాని నేమముతోను ర | |
| | మా మనోహరునిపై తామర పూలను | ॥చల్లరె... |
| 5. | అమిత పరాక్రమ ద్యుమణి కులార్ణవ | |
| | విమలచంద్రునిపై హృత్కుముద సుమములను | ॥చల్లరె... |
| 6. | ఎన్నరాని జనన మరణములు లేకుంట | |
| | మనసార త్యాగరాజనుతుని పైన | ॥చల్లరె... |

ఈ పాటలోని బాహ్యార్థంలో నాలుగైదు రకముల పుష్పాలని ఆ రామచంద్రునిపై చల్లి పూజ చేసే ప్రబోధం ఉంది. ఏరుకున్న పూజాతుల్ని, కూర్చున్న పద సౌరభంతో కలిపి, మనోనాసికతో ఆఘ్రాణించి, పూల నుపహరించిన క్రమం, ఆ క్రమంలో సూచించిన దేవతా మూర్తులను గుర్తించుకొని, సమన్వయాంతరార్థాలు వెదుక్కుంటే త్యాగరాజస్వామి వారి భావ శిల్పోన్నత్యం స్పష్టం అవుతుంది. చల్లె పూవుకీ భక్తుడి మనస్సుకీ పోలిక స్వీకరించుకోవాలి; పోను, పోను, పూవులు మారినట్టే మనస్సు (హృదయం) యొక్క స్థితి, స్థాయీ మారుతూ రావాలనే ఉద్బోధ యీ పాటలో బుద్ధికి తట్టుతుంది. హృత్కుసుమమనే మాట కూడా యీ పోలికనూ, సామ్యాన్నీ సూచిస్తుంది.

మొట్టమొదట, ఇంపైన మనసుతో, సొంపైన బంగారు గంపలతో నింపిన మంచి చంపకాలను ఆ రామచంద్రుని మీద చల్లమన్నారు. కావాలని కోరి, యేరి, ''మంచి" పూవుల్ని, ఇన్నీ అన్నీ కాదు, (ఎన్నింటినో!), గంపల కెత్త దగినన్ని పూవుల్ని తెచ్చి రాగ పూరితమైన మనస్సుతో, రామచంద్రుణ్ణి పూజించే ప్రక్రియ ధ్వనిస్తుంది యీ మొదటి చరణంలో. పూవులు ''మంచి''గా ఉండాలని, గంపల కెత్తేటన్ని పూలను సేకరించాలనీ అవీ, యేవో వెదురు గంపల్లోనో, తాటాకు బుట్టల్లోనో కాక, సొంపైనవని నిర్ణయింప దగ్గవీ, అందులో కూడా బంగారంతో చేసినట్టివీ అయిన సొగసులు చిందే గంపలలో నింపుకొచ్చి, దేవతా విగ్రహం మీద విరజల్లే ''పూజా వైభవ ప్రలోభం'' నింపుకొన్న మనస్సుగల ప్రథమ స్థాయి భక్తుడు గోచరిస్తాడీ చరణంలో. ఆ మనస్సుకీ చంపకాలకీ సామీప్యం; సామ్యం—ఘాటైన సువాసనతో, బంగారు వర్ణ సౌభాగ్యం వెల్లి విరిసే ఆడంబర పుష్పాలు, సంపెంగ పూవులు—రాగ సంయుతమై రాజస తామసాలు ప్రకోపించి, వాసనా విషయాలు ప్రబలే మనస్సుకి సామ్యాలు ఆ చంపకాలు! రెండవ పురుషార్థం (అర్థం) కల్పించే ఆడంబరం నిండిన మనస్సు అది!

ఆ తరువాత చల్లమని చెప్పిన పుష్పాలు, జాజులు—శృంగార రసోద్దీపనాలైన మల్లెలు కావనుకున్నా, చంపకాల కోవలోనివే అయిన ఆ మల్లెలకు చెల్లెళ్లు జాజులు! చంపకాలలో వెల్లివిరిసే బంగారపు వర్ణాడంబరం వదిలించుకుని, రేకల రంగులో నిర్మలమైన తెల్లదనం సాధించుకున్నా, తొడిమల్లో ఆకుపచ్చదనం మిగుల్చుకుని, వాసనలు గుబాళించే పూవులు జాజులు. మనస్సులో కొంత వినిర్మలత సాధించుకున్నా, రాజస తామసాలు కొంతతగ్గి, సత్త్వం పాలు ఎక్కువైనా, వాసనావిషయాలూ, కొన్ని ఆడంబరాలూ, ఏవో మిగుల్చుకున్న మనస్సుకి సామ్యాలు యీ జాజులు. జగత్తులోని పూవులన్నిటిలో దేవపూజార్హమైన పువ్వులేవో నిర్ణయించుకుని, పట్టీ వ్రాసుకుని ఆ పూలరాజిలో మేలైనవి యేవో స్థిర పరచుకొని, ఆ మేలైనవాటిలో యీ జాజులున్నాయని గుర్తించుకొని, వాటిని సేకరించి తెచ్చి, దోసిళ్ళతో చల్లే పరిశ్రమని సూచిస్తోంది, యీ చరణంలో సూచింపబడ్డ పూజా ప్రక్రియ. ఆ ప్రక్రియను వివరించే బుద్ధితో, అలా పూవుల్ని చల్లే మనఃస్థితిని రెండవ మెట్టుగా నిల్పి చెప్పింది యీ చరణంలోని భావం.

తృతీయ పురుషార్థం కామం ప్రకోపించే మనస్సుతో మల్లెల చెల్లెళ్లు జాజుల్ని ఉప యోగించిన పూజ !

ఈ మొదటి రెండు చరణాల్లోనూ ఎవరి మీద చల్లుతున్నామో వివరించు కునే, సూచించుకునే ప్రక్రియ లేదు. ఇకమీద వచ్చే చరణాల్లో "సీతాపతి, రమామనోహరుడు, ద్యుమణి కులార్ణవ విమలచంద్రుడు" అనే పదాలతో దేవతా మూర్తి ప్రసక్తి వచ్చింది. కాని యీ చరణాల్లో, ఆ ప్రసక్తే లేక, బాహ్యపూజ చేసే విధానం పూవుల్ని యేరుకుని, సేకరించి పూజించే ప్రక్రియని గురించిన మాటలే ఉన్నాయి ! బుద్ధి పనిచేసినా, మనస్సూ, హృదయం బాగా రంగంలోకి దిగనట్టి భక్తుని పూజా పరిశ్రమ అన్నమాట !

మొదటి రెండు చరణాల్లో చెప్పబడ్డ పూవుల స్థాయిలో, అదే పంథాలో పూజా ప్రక్రియకి ఉపయోగింప బడ్డాయి, మూడో చరణంలోని పారిజాతాలు. మల్లెల్లాగా, జాజుల్లాగా లౌకిక విషయాల కుపయోగింపబడనివి— పారిజాతా పహరణ ప్రబంధంలోని సత్యభామా ప్రణయ శృంగార గాధని అటుంచితే, మల్లె మాలలూ, జాజి మాలలూ లాగ - స్త్రీ శిరోజాలంకరణకీ. పురుషుల మణికట్టుకట్ల విలాసానికీ ఉపయోగింపబడకే, పెరట్లో పారిజాతం విరబూస్తే, ఆ పూవులన్నీ దేవతా పాదాల చెంతకే చేరుతాయి ! అలాంటి పారిజాతాలని సీతాపతిపై చల్లు తున్నారు, గంపలతో కాదు, దోసిళ్ళతో. "చేతులతో" చల్లమని స్పష్టంగా చెప్పారు త్యాగరాజస్వామివారు. పూవుల తాహతుని నిర్ణయించి, యేర్పరుచుకునే ప్రసక్తే లేదు. దేవతార్చనకు పనికివచ్చే పారిజాతాలవైపు దృష్టి మళ్ళింది కనుక. బంగారు గంపల ప్రసక్తి లేదు, దేవుడిచ్చిన చేతులతోనే పూజించడం తట్టింది కనుక. కాని పూజించే మూర్తిని స్థూలంగా సీతాపతి అని గుర్తించుకుంటూనే, ధాత (ఆ బ్రహ్మదేవుడే) పూజించే జగత్పతి అనికూడా గుర్తించుకునే మనఃస్థితి భక్తుడిది యీ చరణంలో. అంటే చంపకాలూ, జాజులూ చల్లిన నాటికన్న యింకో మెట్టుపై కెళ్ళిన మనస్సు - ఆ పూవుల సామ్యం అలవర్చుకున్న స్థితులను అధిగ మించి, పారిజాత సామ్యం సాధించుకున్న తాహతుకి యెదిగిన మనస్సు.

ఆ తరువాత చరణంలో చెప్పబడ్డ పూవులు తామర పూవులు. దోసిలి నిండినన్ని పూలు తెచ్చినా సంఖ్యలో బహు తక్కువగా ఉంటాయి. ఏ రెండో

మూడో, నాలుగో ఉంటే చాలు దోసిలి నిండిపోతుంది, మొదటి మూడు రకాల పువ్వులకన్నా పరిమాణంలో బాగా పెద్దవి కనుక. చంపకాలూ, జాజులూ, పారిజాతాలూ, చిన్న పువ్వులు- వాసనలు ప్రబలే సంకుచిత హృదయాలకి సామ్యాలు. తామరపూవు విస్తృత హృదయ వైశాల్యాన్ని సూచించే పెద్ద పువ్వు. చంపక, జాజి, పారిజాతాలకన్న వాసన చాలా తక్కువ, ''పద్మగంధం'' అంటూ కొంచెం ఉన్నాను. వాసనా రంగూ తేలికై ఉన్న ఆ తామర పూవుల్ని స్వల్ప సంఖ్యలో సమకూర్చుకున్నాక, వాటితో పూజించే హృదయస్థితి ఎలా ఉండాలో రెండు మాటల్లో సునిశితంగా చెప్పారు త్యాగరాజస్వామి. ''పామరములు'' (పామరులు అంటే అల్పజ్ఞులు, వారికుండే పోకడలు) మానుకొని ''నేమముతో'' (హృదయాన్ని అదుపులో ఉంచుకున్న నిమముతో) చల్లుతున్నది ధాతవినుతుడైన సీతాపతి మాత్రమే కాక, రమా మనోహరుడని కూడా గుర్తించుకుని చల్లమన్నారు. రమాదేవి మనోహరుడు విష్ణువు, అంటే సర్వవ్యాపకుడు, విశ్వాత్ముడు అన్న గుర్తింపుతో ఆ మూర్తిని పూజించమన్నారు. భక్తుడి స్థాయి పెరిగింది; సత్త్వం హెచ్చింది; దేవతామూర్తి గుర్తింపు పైమెట్టు కెళ్లింది. కాని పూర్తిగా శుద్ధసత్వం కుదురలేదు మనస్సుకి: శుద్ధ సత్త్వపు పొలిమేరలకి యీ తట్టునే ఉండి, పరిపక్వం చెందుతూన్న మనస్సుని సూచించి తామరపూవు యీ చరణంలో, ఇంకా బాహిరంగా పువ్వుని తెచ్చి పూజించే ప్రాపంచిక పంధా బుద్ధిలో మెదుల్తూ ఉండిపోయింది భక్తుడికి!

ఐదవ చరణంలో, భౌతికంగా తోటల్లోనూ తటాకాల్లోనూ పెరిగే పువ్వుల ప్రసక్తి విస్మరింపబడ్డది. చర్మచక్షువులకి కనిపించని పువ్వు ఉదహరింపబడ్డది. అది భక్తుని హృదయ కుముదం; అంటే తెల్ల కల్వ పువ్వు భక్తుడి కొక్కటిగనే సాధ్యం. తామరలైనా ఒకటి కన్న ఎక్కువే దొరుకుతాయి. కాని హృత్కుముదం, భౌతికంగా గంపలకూ దోసిలికి యెత్తరానిది! హృదయంతోనే ఆ హృదయ పుష్పాన్ని ఆ దేవదేవుడికి సమర్పించాలి. బాహిరంగా పూజించే ప్రసక్తే లేదు. దేవతామూర్తి కాని, విగ్రహం కాని లేదు. ఆత్మారాముడికి ఆత్మతో ఆత్మని అర్పించుకునే పూజా వైభవం యీ చరణంలో సూచించారు! హృత్కుముదానికి వాసన కాని రంగు కాని అసలే లేనిది. గుణప్రసక్తి, వాసనాప్రసక్తి లేక శుద్ధ సత్త్వం నింపుకున్న మనఃస్థితిని సూచించేది. ఆ స్థితిలో

నిర్గుణ పర్రబహ్మని పూజించాలన్న మాయ యింకా మిగిలింది కనుక ఆత్మా రాముణ్ణి దశరథ రాముడిగా, అమిత పరాక్రమునిగా ఆ ద్యుమణి (సూర్య) కులం అనే ఆర్ణవానికి (సముద్రానికి) విమలచంద్రుడై విరాజిల్లిన ఆ శ్రీరామచంద్రుని మీద చల్లమన్నారు. (సంకోచం లేకుండా ఆలోచన లేకుండా) చల్లబడేది కల్వ: చల్లేది చంద్రుడి మీద, తెల్లకలువలంటే చంద్రుడి కిష్టం; చంద్రుడంటే కలువకి 'వొల్లమాలిన' అనురాగం. యిలా పరస్పరానురాగాలు పెరిగిపోయి, ఆ యిష్టానికి అనురాగానికీ, అర్హత సంపాదించుకున్న మనఃస్థితిని అందుకున్నాడు భక్తుడు. వినిర్మలమై శుద్ధ సత్వగుణ సంభరితమై, తెల్ల కలువకు సామ్యం కుదుర్చుకున్న ఆ హృదయం తానారాధించే ఆవిమల చంద్రుడితో సావర్ణ్యాన్ని సాధించుకుంటుంది. సారూప్యముక్తి అన్నట్టే సావర్ణ్యముక్తిని సాధించుకుంటుంది. అలాంటి ఆ ఒక్క పూవునీ ''మనసార'' చల్లెయ్యడంతో బాహ్యప్రపంచ స్మృతిని విస్మరించిన హృదయస్థితీ, (అక్కడికీ, యిక్కడికీ, పనాల్లోకీ చెరువుల దగ్గరకీ వెళ్లి పువ్వుల్ని యేరి తెచ్చే కామ్యలౌకిక ప్రపంచ వాసనా సంయుతమైన స్థితిని అధిగమించిన స్థితి) ఆ త్యాగరాజనుతుడైన పర్రబహ్మని రామచంద్రుడిగా గుర్తించిన మనస్సు లోనే మనస్సుతోనే మనస్సనే కల్వపూవుని, ఆ చంద్రుడికి చెందేటట్టు చల్లివేసే పరమస్థితికి ఎదిగాడన్న మాట యీ చరణంలోని భక్తుడు.

ఈలాగ ఒక్కొక్క మెట్టే పైకి వెడుతూ, చల్లివేసే పువ్వులగుణ విశేషాల్లో ఎదిగే మనస్సు యొక్క స్థాయి ప్రస్ఫుటమౌతూ ఉండే భక్తి సోపాన మార్గాన్ని సూచించిన గురువర్యులు త్యాగరాజస్వామివారు, ఆఖర్న చరణంలో ఆ పరిశ్రమకి ఫలశ్రుతి వివరించారు—యీ పరిశ్రమ అంతా (యిన్ని రకాల పువ్వులు చల్లడం) ఎందుకనే సందేహం రాకుండాను. ''ఎన్నరాని (లెక్కకు రాని) జననమరణములు'' మామూలుగా బ్రతికే మానవులందరికీ తప్పవని మనం నమ్ముతాం. 'పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీజఠరే శయనం' అన్నది లేకపోవడమే మోక్షం అన్నారు కనుక ''ఎన్నరాని జనన మరణములు లేకుండు బే (భవమోక్షం) యీ పూవుల పూజకు ఫలపరమావధి'' అని నొక్కి చెప్పారు. భక్తియోగంలో బహు సామాన్యమైన పుష్పపూజా ప్రక్రియకు కూడా మోక్షమే ఫలం అని నొక్కి చెప్పి, అంత విశేషమైన విలువైన పరమ ఫలం గమ్యం అయిన మోక్షానికి పూలబాట వేశారు త్యాగరాజ జగద్గురువులు!

హృదయం పుష్పసమం అయినప్పుడు దాన్ని ''ఉంచరే", ''వెయ్యరే'' ''విసరరే'' అనకుండా ఆద్యంతం ''చల్లరే'' అనే పదాన్ని వాడుకోవడంలోనే త్యాగరాజస్వామి వారి కవితా ప్రతిభ ద్యోతకం అవుతుంది. ఉంచినా, వేసినా, విసిరినా భక్తుడు పట్టుబట్టి చేసిన పరిశ్రమ సూచింపబడుతుంది. కాని చల్లడంలో అన్నీ వొదులుకుని (పరిశ్రమని కూడా విస్మరించిన) తెగింపు ధ్వనిస్తుంది. ప్రయత్నం విస్మరించి, కేవల శరణాగతిని భావించుకుంటూ, మనసార పువ్వులు చల్లడం అలవాటు చేసుకుంటూ, చివరకు తన హృదయాన్నే చల్లివేయమన్న ఉద్బోధ యెంత మహత్తరమైన ఉద్బోధ అవుతుందో గుర్తించుకోవచ్చు!

అలా ''చల్లే'' పూవుల రంగులో, వాసనలో, పరిమాణంతో, పూల సంఖ్యతో క్రమంగా మార్పులు సూచింపబడ్డట్టే, పూజించే దేవుని గుర్తించుకోడంలోనూ అంతస్తు పెరుగుదల సూచింపబడ్డది. పల్లవిలో ఉదహరింపబడిన రామచంద్రుడు చంపకాలనీ, జాజులనీ చల్లేటప్పుడు ప్రత్యేకంగా వర్ణింపబడ లేదు. పూజాసుమాలు పారిజాతాలదాకా వచ్చినప్పుడు, ధాతవినుతుడైన సీతాపతి అనే భావన ముందుకుతోసుకువస్తుంది. తామరపూవులు చల్లేటప్పుడు ఆ అవతార మూర్తి రమామనోహరుడూ, సర్వ వ్యాపకుడూ అయిన విష్ణువనే గుర్తింపు కలుగుతుంది. ఆ రాముడూ, ఈ విష్ణువూ ఒక విధంగా పురాణ విగ్రహాలే. కాని హృత్కుముదాన్ని చల్లివేసే మనస్సులో మెదిలే దేవుడు, విరాట్ పరాక్రమ శక్తి సమన్వితుడూ, ముమ్మూర్తులు పొగడే ద్యుమణికులార్ణవ విమలచంద్రుడు-తేజోమూర్తి. రెండు చేతుల రాముడూ సీత భర్త లాంటి వర్ణనా లేదు. లక్ష్మి భర్త లాంటి గుర్తింపూ ఉన్న మాటలు లేవు. కరచరణాద్యవయవాల ప్రసక్తి లేని అనుపమ, అప్రమేయ తేజఃపుంజంగా ఉంటాడు. అఖర్న ఫలశ్రుతి చెప్పుకునేటప్పుడు పరమాత్మ స్వరూపం గుర్తెరిగిన (త్రిమూర్తులకు కూడా అది సాధ్యంకాదట) ఈ త్యాగరాజ వాగ్గేయకారుడు నుతించే రాముడు, ఆ త్యాగరాజు (శివదేవుడు) నుతించే రాముడుగా మిగిలిపోతాడు. త్యాగరాజను తుడెవరూ అంటే, ''ముమ్మూర్తులు గుమిగూడి పొగడే ముచ్చట వినుకొనరే'' అనే పల్లవి కల అఠాణరాగ కీర్తనలో జబాబు దొరుకుతుంది. ఆ త్యాగరాజ నుతుడు ఏక గుణ ప్రధానులై ఉండే త్రిమూర్తులకు అంతుచిక్కనివాడు. గుణాతీతులకే అర్థంఅయ్యే సచ్చిదానంద నిర్గుణ పరబ్రహ్మ. భక్తుని హృదయస్థాయి పెరిగిన

కొద్దీ ఆ హృదయంలో నిల్చే భగవద్మూర్తి కూడా పెరిగిపోయిన క్రమం యీ కృతిలో కన్పిస్తుంది. పువ్వులని గురించిన, పూజాక్రమం గురించి ఆలోచనలూ, నిర్ణయాలూ నిండిఉన్న మనఃస్థితిలో భగవంతుడికి కూడా గుణ స్వరూప వైవిధ్యం, ఆ మనోనిర్ణయ వైవిధ్యంతోటే మారుతూ ఉంటుందన్న మాట. ఆఖర్న, అలాంటి భావ సంచలనాలు లేని హృదయం ఉంటే (తన హృత్కుముదాన్ని, తన హృదయంతో తన హృదయాంతర్గతుడైన పరమాత్మ కర్పించుకునే స్థితివస్తే, ఆ నిర్గుణ పరబ్రహ్మతో నిర్వికారమై, నిస్సంకోచంగా తాదాత్మ్యం పొందుతుందీ, అదే ఎన్నరాని జనన మరణములు తేకుండు మోక్షం అన్న మహోన్నత పాఠాన్ని అలవోకగా సూచించారు త్యాగరాజస్వామివారు!

ఆఖరి చరణంలోని "త్యాగరాజ నుతుడు'' ఆ శివ దేవుడు కీర్తించే దేవుడనుకొన్నా (తిరువయ్యూర్‌లో త్యాగరాజ దేవాలయంలో ఉన్న దేవతామూర్తి పరమశివుడే), ఆ సచ్చిదానంద పరబ్రహ్మకే అన్వయిస్తుంది. ఈలా సగుణమూర్తిని పువ్వులతో పూజించుకొనే భక్తి ప్రక్రియకు ఫలపరమావధి నిర్గుణ పరబ్రహ్మకు తన్నుతాను (హృత్కుముద రూపంలో) అర్పించుకొని, ఆ పరబ్రహ్మతో తాదాత్మ్యం పొందడమే, అన్న మహోత్కృష్ట పాఠాన్ని పూలబాటలో, పూల మాటల్లో తేటపరిచారు, త్యాగరాజస్వామివారు !

ఈ పాటని పరమ భక్తుల పట్టీలో ప్రథమముడిగా ఉదహరింపబడే ప్రహ్లాదునిచే పాడించారు, త్యాగరాజస్వామివారు. తాను రచించిన గేయ ప్రబంధం, ''ప్రహ్లాద భక్తవిజయం'' లో తనతో ఉన్న బ్రహ్మ, ఇంద్రుడూ మొదలైన దేవతల్ని ఉద్దేశించి, వాళ్ళను ఆ దేవదేవుణ్ణి పూజించమని హెచ్చరిస్తూ, పూవులను రామచంద్రునిపై చల్లమని ఉద్బోధిస్తూ, ఉత్సాహంతో పాడతాడు ప్రహ్లాదుడు ఆ గేయ నాటకంలో, తనతోటి భక్తులందర్నీ అదే ఉత్సాహంతో యీ పాట పాడుకుంటూ, ఆ రామచంద్రునిపై పూలుచల్లి, పూజిస్తూ తరించమని ఉద్బోధిస్తూ యీ పాటను రచించి మనకందరికి ప్రసాదించారు త్యాగరాజస్వామివారు. మన తెలుగువారికి అబ్బిన అద్భుత వారసత్వంలో భాగంగా, ఆ సంగీత సంప్రదాయం, యీ త్యాగరాజస్వామి వారి కృతిసముదాయం మనకు మిగిలాయి. ఈలా అన్వయించుకొన్నప్పుడు త్యాగరాజస్వామి వారి కవితావైభవం ఎంత జాజ్వల్యమానమో, తెలుగు గడ్డమీద పుట్టిన మన సాంస్కృతిక వారసత్వపు వైభవం ఎంత సౌభాగ్యప్రదమో అనిపిస్తుంది !

* * *

## * నీ నామరూపములకు—మంగళం

సౌరాష్ట్రరాగం—ఆదితాళం

పల్లవి: నీ నామరూపములకు—నిత్యజయ మంగళం ॥నీ...

అనుపల్లవి: పవమానసుతుడుబట్టు—పాదారవిందములకు ॥నీ...

చరణములు: 1. పంకజాక్షినెలకొన్న—అంకయుగములకు ॥నీ...

2. నవముక్తాహారము—నటియించు ఉరమునకు ॥నీ...

3. నళినారిగేరు చిరు—నవ్వుగలమోమునకు ॥నీ...

4. ప్రహ్లాదనారదాది—భక్తులు పొగడుచుండు ॥నీ...

5. రాజీవనయన త్యాగ—రాజ వినుతమైన ॥నీ...

సంగీత కచ్చేరీలలో, ఆఖర్న మంగళాచరణంగా యీ పాట యొక్క పల్లవి సభికుల చెవుల్లో మార్మోగుతుంది. ''పవమాన సుతుడు బట్టు—'' అన్న పదములు వినగానే, సర్దుకుని లేచి ప్రయాణోన్ముఖులౌతారు శ్రోతలు! ''రాజీవ నయన త్యాగరాజ వినుత'' అనే పాదం ఆ వెంటనే పాడేసి అయిందనిపిస్తాడు గాయకుడు. అందులో కూడా, ఆఖర్న మధ్యమావతి ఆలపించే సంప్రదాయం నిలబెట్టాలని, ఆ రాగాన్నందుకునే తొందరలో, కచ్చేరీ యెలాగో అయిందని పిస్తాడు.

అయితే యీ పాటని సాంతం అన్ని చరణాలూ పాడుకుంటే, నిదానంగా శ్రీ రామచంద్రమూర్తిని కన్నులారా చూస్తూ, ఎడమనుంచి కుడివైపుకు హారతి పళ్ళెం త్రిప్పుకుంటూ వస్తూంటే కనిపించే ఆ దివ్య మనోహరమూర్తి వైభవాన్ని భక్తి ప్రపూరితమైన హృదయంతో త్యాగరాజస్వామి వర్ణించుకున్న సొంపు తెలుస్తుంది.

పల్లవిలో ఆ రాముని నామ రూపాలకి రెంటికీ నిత్యజయమంగళం పాడుతున్నానని, శ్రీరాముణ్ణి హెచ్చరించారు త్యాగరాజస్వామి. ఇక్కడ క్రమం నామం, ఆ తరువాత రూపం, నామరూపాలు రెండూ ధ్యాన భక్తిలో ముఖ్యాంశాలు. సహస్రనామ తుల్యమైన నామం హృదయాంతర్గతమై నిల్చిపోతుంది. బాహ్యంలో ఇంద్రియ గోచరమయ్యేది అవయవాలరూప వర్ణన. ప్రాముఖ్యతలో నామం తరువాతనే రూపం అయినా, సాధనాక్రమంలో ముందు రూపం, తరువాత నామం కనుక త్యాగరాజ స్వామివారు ఆ క్రమంతోనే యీ పాట పాడారు.

కర్పూరం వెలిగించి, మొదటగా హారతి పళ్ళెం చేతులతో కాస్త పైకెత్తగానే పాద దర్శనం అవుతుంది. ఆ పాదాలు పవమానసుతుడైన ఆంజనేయ

స్వామి భక్తితో పట్టుకున్నవి-త్యాగరాజస్వామి నిత్యం పూజించుకునే శ్రీ రామ పంచాయతన విగ్రహాలలో, రామ పాదాల దగ్గర మోకరించిన హనుమంతుడుంటాడు. పళ్ళెం యింకొంచెం పైకెత్తగానే కర్పూరపు వెలుగు రాముల వారి అంకపీఠవరకూ వస్తుంది. అక్కడ పంకజాక్షి సీతమ్మ నెలకొని ఉంటుంది. చూపు ఆ జగన్మాతను దర్శించుకొంటుంది. సీతమ్మ పేర్లు యీ పాటలో ఉదాహరించరు స్వామివారు. కాని ఏక పత్నీవ్రత దీక్షితుడైన శ్రీరామచంద్రునికి పంకజాక్షి ఒక్కర్తే-తన అంకపీఠిని అధివసించేది. కృష్ణుడి విషయంలో అంకపీఠి మీది పంకజాక్షి అంటే, ఎవరనే ప్రశ్నరావచ్చు-కాని ఆ సందేహం రాని విషయంలో పంకజాక్షి అంటే సీతమ్మే అని ధైర్యంగా సూచించి ఆ రాముని ఏక పత్నీవ్రతం కూడా స్ఫురింపచేశారు. అలాగే పాట చివర రాజీవనయన అని సంబోధించినపుడు ఆ రాజీవనయనుడు రాముడే అవుతాడు. త్యాగరాజస్వామికి రాజీవనయనుడు ఆ రాముడొక్కడే!

నీరాజన జ్యోతిని యింకొంచెం పైకెత్తగానే, రాములవారి వక్షస్థలం వెలుగులోకి వస్తుంది. అక్కడ నవ ముక్తాహారములు నటియిస్తూ కనిపించాయన్నారు. విగ్రహాల మీద ఉన్న హారాలు కదలవు కాని త్యాగరాజస్వామి చూపులకు ఆ ఉరము మీద ముత్యాలహారాలు "నటిస్తూ" ఉంటాయి-కదులుతూ ఉంటాయి! కేవల చైతన్యమే మూర్తీభవించిన పరమేశ్వరుని వక్షస్థలం మీద ముత్యాల సరాలు కదులుతూన్నట్టు చూడడం, అలా అని చెప్పటం-భక్తుని తాదాత్మ్యానికి పరాకాష్ఠ!

ఆపైన కర్పూరపు వెలుగు అందుకునేది శ్రీరామచంద్రులవారి ముఖము. అది చిరునవ్వుగల మోము—మందహాసం నిత్యం శోభించే ముఖం, ఆ సౌమ్య మూర్తిది. ఆ మోము నలినారిని (పద్మములకు అహితుడు చంద్రుని) కేరుసట్టేది, పరిహసించేది, తిరస్కరించేది. ఆ చందమామ కన్న అందమైనదీ, సౌమ్యమైనదీ ఆ మోము! ఆ చంద్రుని వెన్నెలకన్న చల్లనై ఉత్సాహమిచ్చేది ఆ చిరునవ్వు—అని సూచన!

ఇక హారతి పళ్లెం క్రిందకు కుడివైపు నుంచీ త్రిప్పుడు వస్తే కూడా యీ మూడు చరణాల్లో వివరాలే మళ్లీ కనిపిస్తాయి; కనుక త్యాగరాజస్వామి పునరుక్తి లేకుండా, తన దేవుని నామ మహిమను (పల్లవిలో ఉదహరించినది) జ్ఞాపకం చేసుకుంటారు. అదే రాముడితో చెప్తారు—ఆతని నామ వైభవాన్ని ప్రహ్లాద నారదాదిభక్తులు పొగుడుతూ ఉంటారని పరమ భక్తుల పట్టిలో, ప్రహ్లాద నారదులు మొట్టమొదట ఉంటారు. (ప్రహ్లాదనారద పరాశర పుండరీక..) ప్రహ్లాదుడు పరమభక్తుడు; నారదస్వామి త్యాగరాజస్వామికి సంగీత గురువు. మనందరికీ త్యాగరాజస్వామి వారు ఆ యిద్దరంతటివారు!

ఆఖరి చరణంలో ఆ పళ్లెం త్రిప్పుతూనే శ్రీరామవదనాన్ని కన్నులు మూసుకు చూస్తున్నా, మనస్సులో నిరూపించుకునేటప్పుడు, త్యాగరాజస్వామికి అత్యంత మనోమోహనాలైన ఆ విశాలసుందర నయనాలు మనస్సులో తళుక్కుమని ఉంటై—అంచేత రాజీవ నయన అని సంబోధించి, త్యాగరాజ వినుతం ఆ నామం అని రామునితో చెప్తారు. రూప సౌందర్యానికి తార్కాణాలు, రాజీవ నయనాలు; నామ వైభవానికి తార్కాణం శివదేవుని పొగడ్త. త్యాగరాజ స్వామివారుండే గ్రామంలో శివాలయంలో ఉన్నమూర్తి పేరు త్యాగరాజు. శివుడు పార్వతీదేవికి సహస్రనామ తత్తుల్యం అని రామ నామాన్ని వినుతించి వివరిస్తాడు. ఈ కృతి కర్త త్యాగరాజుకి కూడా ఆ రామ నామం కీర్తించడమే జీవనం. ముక్త సంగుడైన ఆ వాగ్గేయకారుడు వినుతించిన నామం యొక్క వైభవాన్నీ ఆ దివ్య రూపాన్నీ మనస్సుకు హత్తుకునేటట్లు, కళ్ళకు కట్టేటట్లు చెప్పి వివరించేది యీ కృతి !

పళ్ళెం పైకెత్తేటప్పుడు నెమ్మదిగా సాగుతుంది చెయ్యి; క్రిందకు దింపేటప్పుడు అనుకోకుండానే తొందరగా దిగుతుంది. కనుకనే పైకెత్తేటప్పుడు మూడు చరణాలు పాడి, క్రిందకు దింపేటప్పుడు రెండే పాడారు త్యాగరాజ స్వామి ! పూజా విధానంలో, కాలాన్ని ఉపయోగించుకోడం అలా సూచింపబడింది !

ఈ మంగళం సౌరాష్ట్రి రాగంలో ''ప్రహ్లాదభక్త విజయం'' అనే గేయ ప్రబంధంలో రచించారు—అక్కడ ప్రహ్లాదుడు శ్రీమన్నారాయణ మూర్తిని పూజించే విధానంలో ఆతడు పుష్పపూజచేసి నీరాజనం పట్టుతూ పాడినట్లున్నది. కాని, త్యాగరాజస్వామికి నారాయణుడంటే శ్రీరాముడే కనిపిస్తాడు. అంచేత ప్రహ్లాదుడికీ ఆలాగే కనిపించిందన్నారు. ప్రహ్లాదునికి తనతో, లేదా తనకి ప్రహ్లాదుడితో, తాదాత్మ్యం. కనుకనే త్రేతాయుగంలో రాబోయే రామావతారాన్ని, కృతయుగంలోనే ప్రహ్లాదు డూహించుకున్నాడనే సందర్భం కల్పించుకున్నారు. ''ప్రహ్లాదభక్త విజయం'' త్యాగరాజస్వామి వారు రచించిన కల్పిత కావ్యం—అందులోని ప్రహ్లాదుడు, భక్తి పారవశ్యంలో ఆ విశ్వాత్ముడితో తాదాత్మ్యం పొందినపుడు కాలాతీతుడై, త్రికాలవేది అయి శ్రీరాముని నామ వైభవాలని వర్ణిస్తూ, నీరాజనం పట్టాడు. అలా అని చెప్పిన త్యాగరాజ స్వామి వారి కవితా ప్రతిభ ఎంత వైభవోపేతం !

*శ్రీ త్యాగరాజ స్వామి వారి [illegible] [illegible] [illegible]గానికి, ఇది మానస నీరాజనం !*



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగువిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య